INTRODUCTION TO THE STUDY OF HOLY QURAN
(Telugu)

# ఖుర్ఆన్
## అవగాహనకు
# [illegible]ాలి సూత్రాలు






తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

Introduction to the Study of
Holy Qura'n
(TELUGU)

## ఖుర్‌ఆన్ అవగాహనకు

# మూల సూత్రాలు

రచన:

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది

అనువాదం:

ఎస్. ఎమ్. మలిక్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002

# మా మాట

దివ్య ఖురాన్, దాని పేరుకు తగ్గ విధంగానే ప్రపంచంలో కెల్లా అత్యధికంగా చదవబడే, అధ్యయనం చెయ్యబడే గ్రంథం అనడంలో సందేహంలేదు (ఖుర్ఆన్ అన్న అరబీ పదానికి మాటి మాటికీ అధి కంగా పఠించబడేదని అర్థం). అయితే దీని చదువరుల్లో విభిన్న రకాల వారున్నారు. దీని పట్ల కేవలం పవిత్ర భావంతో, దైవగ్రంథం అన్న శ్రద్ధాభావంతో పారాయణం చేసే వారు మొదలుకుని, దీన్ని అర్థం చేసుకుని దీన్ని తమ క్రియా జీవితంలో ప్రతిబింబింప చేయాలన్న ఉద్దే శ్యం గల సజ్జనులు, మానవ సంస్కృతే ఓ మలుపులో ఉన్న తరుణంలో ఇది అవతరించి, ప్రపంచంలో కెల్లా మూఢ ప్రజలయిన వారిని అత్యున్నత సంస్కారవంతులుగా తీర్చిదిద్దిన విప్లవ గ్రంథం అన్న విషయం దృష్టిలో ఉంచుకుని దీని లోటు పాతుల్ని తెలుసుకోవాలన్న ధ్యేయం గల జిజ్ఞాసువులు, ఇది అవతరించి 14 వందల ఏళ్ళు గడచినా దీని అనుయాయుల్లో దీని పట్ల గల శ్రద్ధా ప్రతిపత్తుల్లో ఏమాత్రం లోటు రాకపోవడం, వారు నేటికీ దీన్ని తమ జీవన నియమావళిగా భావించి దీని ఆదేశాల కనుగుణంగా తమ వ్యక్తి గత, సామూహిక జీవితాలను తీర్చి దిద్దుకోవడం చూచి ఆశ్చర్యపడ టంతో పాటు ఈర్ష్యా ద్వేషాలతో దహించుకుపోయే అల్పబుద్ధులూ— దీని పాఠకుల్లో ఉన్నారు.

ఈ దివ్య గ్రంథాన్ని చదివే వారెవరయినా సరే, వారు దీన్ని నిజం గానే అర్థంచేసుకోదలిస్తే దీన్ని గురించి తెలుసుకోవలసిన విషయాలేవి? పాటించవలసిన పఠన నియమాలేవి? అన్న విషయాలను వివరించేదే మీ చేతుల్లో ఉన్న ఈ చిరు పుస్తకం.

ఈ పుస్తకం వాస్తవానికి మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ, దివ్యఖుర్ఆన్‌కు తన వ్యాఖ్యాన గ్రంథమయిన "తఫ్‌హీముల్ ఖుర్ఆన్" కొరకు వ్రాసిన ఉపోద్ఘాతం. అయితే ఈ ఉపోద్ఘాతంలో మౌలానా మౌదూదీ చర్చించిన విషయాలన్నీ సూత్రప్రాయ మయినవి కావడం చేత దివ్యఖుర్ఆన్ యొక్క ఏ అనువాదాన్ని పఠించే జిజ్ఞాసువు అయినా ఖుర్ఆన్‌ని అర్థం చేసుకోవడంలో దీని ద్వారా సహకారం పొందగలరన్న భావంతో దీన్ని వేరుగా పుస్తక రూపంలో ప్రచురిస్తున్నాము. ఖుర్ఆన్ అవగాహనా మార్గంలో ఇది ఎంతో దోహదపడగలదని, దీని ద్వారా ఖుర్ఆన్ పాఠకుల మార్గం సుగమమవుతుందని ఆశిస్తున్నాము. ఇందులోని ఏ అంశాలయినా బోధపడటంలో క్లిష్టత ఏర్పడితే మాకు తెలిపినట్లయితే దాన్ని మలి ముద్రణలో దూరం చెయ్యడానికి కృషి చెయ్యగలము.

— ప్రకాశకులు.

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

దివ్య ఖురాన్ అధ్యయనానికిగాను ఈ చిరు పుస్తకాన్ని వ్రాయటంలో రెండు లక్ష్యాలు నా దృష్టిలో ఉన్నాయి.

మొదటిదేమంటే, దివ్య ఖుర్‌ఆన్ అధ్యయనానికి ముందు దాని అవగాహనకు దోహదం చేసే విషయాలను ప్రారంభంలోనే స్పష్టంగా పాఠకునికి తెలుపటం. లేకపోతే ఈ విషయాలు, అధ్యయనం చేసేటప్పుడు మాటి మాటికీ సంశయ జనకంగా పరిణమిస్తాయి. ఒక్కొక్కప్పుడయితే కేవలం వీటిని అర్థం చేసుకోని కారణంగానే మనిషి సంవత్సరాల తరబడి శ్రమించినప్పటికీ దివ్య ఖుర్‌ఆన్ సారాన్ని గ్రహించలేడు. దాని భావాల లోతుల్లోకి దిగే మార్గం అతనికి కానరాదు.

రెండవదేమంటే, దివ్య ఖురాన్‌ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నప్పుడు సాధారణంగా పాఠకుల మనస్సుల్లో ఉత్పన్నమయ్యే ప్రశ్నలకు సమాధానం మొదట్లోనే ఇవ్వాలన్నది. ప్రారంభంలో స్వయంగా నా మనస్సులో ఉత్పన్నమైన ప్రశ్నలకు లేక తరువాత నాలో తలెత్తిన సమస్యలకు మాత్రమే సమాధానం ఇస్తాను. ఇవి కాక ఇంకా ఏవన్నా ప్రశ్నలు ఉదయిస్తే, వాటిని నాకు తెలిపితే దైవ చిత్తమయితే, నేను వాటికి సమాధానం, తరువాతి ముద్రణలో ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

# ఏకైక గ్రంథం

సాధారణంగా మనం చదివే పుస్తకాల్లో ఒక నిర్ణీత విషయానికి సంబంధించిన సమాచారం, అభిప్రాయాలు, ఆధారాలు, నిరూపణలు అన్నీ ఒక ప్రత్యేక రచనాక్రమంలో నిరంతరంగా వివరించబడతాయి ఈ కారణంగా ఇంతవరకు ఖురాన్‌తో పరిచయం లేని వ్యక్తి మొదటి సారిగా ఈ గ్రంథాన్ని చదవటానికి సంకల్పించుకున్నప్పుడు. 'గ్రంథం' అయిన కారణంగా ఇందులోనూ మామూలు గ్రంథాల వలె ఇతివృత్తం ముందుగానే నిర్ణయించబడుతుందనీ, తరువాత అసలు విషయాన్ని అధ్యాయాలుగా, విభాగాలుగా విభజించి క్రమంగా ఒక్కొక్క సమస్యనే చర్చించటం జరుగుతుందనీ, ఇదేవిధంగా జీవితానికి సంబంధించిన ఒక్కొక్క రంగాన్ని వేర్వేరుగా తీసుకుని దానికి సంబంధించిన ఆదేశాలు నిర్దేశాలు వరుస క్రమంలో పేర్కొనబడి ఉంటాయని అతడు ఆశిస్తాడు. కాని గ్రంథాన్ని తెరచి అధ్యయనం ప్రారంభించినప్పుడు అతనికి ఎదురయ్యేది, అతడు ఆశించిన దానికి పూర్తిగా భిన్నమైన, ఇంతవరకు పరిచయంలేని కొత్త పంథాలో నడిచే ప్రకటనా విధానం. ఇక్కడ అతడు—విశ్వాసానికి సంబంధించిన సమస్యలు, నీతిబోధలు, ధర్మ శాసనాలు, ధర్మసందేశం, హితోపదేశం, గుణపాఠం, విమర్శ, అధిక్షేపణ, భయభక్తులు, శుభవార్తలు, సాంత్వన వచనాలు, నిదర్శనాలు నిరూపణలు, చారిత్రక గాథలు, సృష్టి నిదర్శనాలను, సూచించడం— ఇవన్నీ మళ్ళీ మళ్ళీ ఒకదాని తరువాత మరొకటి రావటం తిలకిస్తాడు. ఒకే విషయం విభిన్న రీతుల్లో విభిన్న పదాల్లో పునరుక్త మవుతుంది. ఒక విషయం తరువాత మరొక విషయం, ఒక దాని తర్వాత ఇంకొక విషయం అకస్మాత్తుగా ప్రారంభ మవుతాయి. అంతే కాదు, ఒక విషయం మధ్యలోమరొక విషయం ఆకస్మికంగా వచ్చేస్తుంది. సంబోధితుడు, సంబోధకుడు మాటి మాటికీ మారుతూ ఉంటారు; సంబోధన ఉండీ ఉండీ విభిన్న దిక్కులకు మళ్ళుతూ ఉంటుంది. అధ్యాయాలు, ఖండాల విభజన ఎక్కడా కన్పిం

చదు. ఏదైనా చారిత్రక విషయం వస్తే, అది చరిత్ర రచనా విధానంలో ఉండదు; తత్వ శాస్త్రం, లోకోత్తర విషయాలు వస్తే, అవి తర్క, తత్వ శాస్త్రాల పరిభాషలో ఉండవు; 'మానవుడు' మరియు 'విశ్వం'ను గురించి ప్రస్తావించటం జరిగితే, అది ప్రకృతి శాస్త్రాల Natural sciences పద్ధతిలో ఉండదు. నాగరిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక విషయాలకు సంబంధించిన చర్చ జరిగితే, ఆ చర్చా ధోరణి ఆ ఫక్కీలో ఉండదు; శాసనాలు, చట్టాలు, న్యాయశాస్త్ర సూత్రాల వివరణ వస్తే, అది న్యాయశాస్త్రజ్ఞుల పద్ధతికి అనుగుణంగా జరగదు; నీతి బోధ జరిగితే, అది నీతి శాస్త్రాలకు సంబంధించిన సాహిత్యంలో ఉన్న విధంగా ఉండదు.

కనుకనే మనిషి, పూర్వం 'తనకు' గ్రంథం గురించి ఉన్న భావానికి పూర్తిగా భిన్నంగా ఉన్న దీన్ని చూసి కంగారు పడతాడు. ఖురాన్ అతనికి సంకలనా దోషంతోనిండిన గ్రంథంగా, వాక్యాల్లో సమన్వయం లేని రచనగా, విషయ క్రమంలేని కలగూరగంప లాంటి పుస్తకంగా కనిపిస్తుంది. ఇది మొదటినుండి చివరివరకు అగణ్యమయిన వేర్వేరు చిన్న పెద్ద వ్యాసాలతో నిండిన కూర్పు మాత్రమే కాని, ఎడతెగని రచనగా వ్రాయబడిందని అతడు అనుకుంటాడు. పర్యవసానంగా వ్యతిరేక దృక్కోణంగల వ్యక్తి ఈ ఒక్క విషయం ఆధారంగానే రకరకాల ఆక్షేపణలు లేవనెత్తటం మొదలు పెడతాడు. సానుకూల దృక్కోణంగల వ్యక్తి ఒక్కొక్కప్పుడు అర్థాన్ని అంతగా పట్టించుకోకుండా అనుమానాలకు దూరంగా ఉండడానికి ప్రయత్నిస్తాడు. మరొకప్పుడు బాహ్యంలో కన్పించే ఈ క్రమ రాహిత్యానికి ఏవో సాకులు చెప్పుకుని మనసును కుదుట పరచుకుంటాడు. ఇంకొకప్పుడు కృత్రిమంగా వాక్యాల్లో క్రమాన్ని, సంబంధాన్ని అన్వేషించి, చిత్రవిచిత్రమైన భావకల్పనలు చేస్తాడు. చివరికి ఖురాన్, 'విభిన్న విషయాల కలగూరగంప' అనే వింత సిద్ధాంతాన్ని స్వీకరిస్తాడు. ఫలితంగా ప్రతి ఖురాన్ వాక్యం తన సందర్భానికి దూరమయి వక్త అభిప్రాయానికి భిన్నమయిన విభిన్న భావాల కొలువు కూటమయి నిలుస్తుంది.

ఒక గ్రంథాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలంటే, పాఠకునికి తప్పనిసరిగా, దాని ఇతివృత్తం ఏమిటో తెలియాలి. దాని ఉద్దేశ్యం, దాని ప్రధాన విషయాలు తెలిసి ఉండాలి. దాని శైలి, దాని పరిభాష, దాని ప్రత్యేక భావప్రకటనా విధానం పరిచయమై ఉండాలి. దానిలో ఉన్న వివరణలు, వాటి పూర్వరంగానికి సంబంధించిన పరిస్థితులు అన్నీ కళ్ళెదుట ఉండాలి. సాధారణంగా మనం చదివే గ్రంథాల్లో ఈ విషయాలన్నీ తేలిగ్గా దొరుకుతాయి. అందువల్ల వాటి సారాన్ని గ్రహించటం అంత కష్టం కాదు. కాని ఇవన్నీ మనకు ఇతర గ్రంథాల్లో లభించే విధంగా ఖురాన్‌లో లభించవు. కనుక ఒక సాధారణ పాఠకునిలా మనలో ఎవరయినా ఖురాన్ అధ్యయనానికి ఉపక్రమిస్తే, దాని ఇతివృత్తం, దాని ఉద్దేశ్యం ఏమిటో అర్థంకాక తికమక పడతాడు, దాని శైలి, దాని భావప్రకటనా విధానం కూడా కొత్తగా కనిపిస్తాయి అతనికి. అనేక చోట్ల వాక్యాల (ఆయత్‌ల) సందర్భం అతని దృష్టికి దూరంగా ఉంటుంది. పర్యవసానంగా, విభిన్న ఆయతుల్లో ప్రోక్తమయిన వివేచనా కాంతిని ఎంతోకొంత గ్రహించినప్పటికీ, మనిషి 'దైవ వాణి' అసలు సారాన్ని ఆస్వాదించలేడు. దైవ గ్రంథ పరిజ్ఞానం పొందటానికి బదులుగా అతడు కేవలం కొన్ని వేర్వేరు అంశాలను, భావాలను మాత్రమే గ్రహించి తృప్తిచెందవలసి ఉంటుంది. వాస్తవానికి ఖురాన్‌ను పఠించి కొందరు సందేహాలకు, కుశంకలకు లోనయి పెడమార్గం పట్టడానికి ఇది కూడా ఒక కారణమే.

గ్రంథ సమవగాహనకు కావలసిన అత్యవసర ప్రాథమిక విషయాలు సరిగ్గా తెలియకపోవటం చేతనే, ఖురాన్ పఠించేటప్పుడు, ఇలాంటి వారికి, దీని పుటల్లో వివిధ విషయాలు చెల్లాచెదురుగా కనిపిస్తాయి. ఎన్నో ఆయతుల (వాక్యాల) భావం వారికి బోధపడదు, ఇంకా ఎన్నో ఆయతుల్ని—అవి విజ్ఞతతో విలసిల్లినప్పటికీ—ఇతర ఆయతుల మధ్యన చూస్తే, అవి అక్కడ అతకనట్లు తోస్తోంది. ఇంకా ఎన్నో చోట్ల ఖురాన్ భావ ప్రకటనా విధానంతో, దాని ప్రత్యేక శైలితో పరిచయం లేకపోవటంచేత, వారు దాని అసలు అర్థానికి ఎంతో

దూరంగా వెళ్ళిపోతారు. ఇంకా, చాలా సందర్భాల్లో ఆయతుల అవతరణా సందర్భం సరిగ్గాతెలియని కారణంగా, తీవ్రమయిన అపోహలు, అపార్థాలు ఏర్పడుతాయి.

ఖురాన్ ఎటువంటి గ్రంథం? అది అవతరించిన విధానం ఎటువంటిది? దాని క్రమం, కూర్పులు ఎటువంటివి? దాని చర్చనీయాంశం ఏది? దాని వాదనయొక్క ఉద్దేశ్యమేమిటి? ఇందులో చర్చించబడిన ఎన్నో విభిన్న ఉపవిషయాలకు ఏ ప్రధాన విషయంతో సంబంధం ఉంది? తన ఉద్దేశాన్ని వ్యక్తపరచడానికి అది ఏ నిర్ధారణా పద్ధతిని ఏ చర్చా విధానాన్ని అవలంబించింది? ఇవీ, ఇంకా ఇలాంటివే మరికొన్ని అవసరమైన ప్రశ్నలకు సమాధానాలు ప్రారంభంలోనే మనిషికి స్పష్టంగా, సూటిగా లభిస్తే, అతడు ఎన్నో ఉపద్రవాలను తప్పించుకుంటాడు, అతని అవగాహన ఆలోచనా మార్గాలు సువిశాలమవుతాయి. ఖురాన్‌లో 'రచనా క్రమాన్ని' వెదికి, అది అందులో దొరక్క పోవడంతో, అతడు గ్రంథం యొక్క పుటల్లోనే కొట్టుమిట్టాడుతూ ఉంటాడు. ఈ చిక్కుకు కారణం, ఖురాన్ పఠనానికి సంబంధించిన ఈ ప్రాథమిక సూత్రాలను అతను తెలుసుకోకపోవడమే. అతడు, తాను మత విషయంపై ఒక గ్రంథాన్ని చదువబోతున్నాననే భ్రమతో గ్రంథ పఠనం ప్రారంభిస్తాడు. 'మత విషయం' 'గ్రంథం'– ఈ రెంటిని గురించి అతనిలో ఉన్న భావనలు, సాధారణంగా ప్రజల్లో 'మతం', 'గ్రంథం' అనే వాటిని గురించి ప్రచారంలో ఉన్న భావనలే. కాని ఇక్కడ తన ఊహాజగత్తులోని రూపానికి పూర్తిగా భిన్నమైన రూపాన్ని చూసి అతడు ఈ గ్రంథానికి చేరువ కాలేక పోతాడు. ఇంకా ఈ గ్రంథంలోని విషయానికి మూలం చేజిక్కకపోవడంతో కొత్త నగరంలోని వీధుల్లో మార్గం తప్పి తిరుగాడే బాటసారి మాదిరిగా, అతడు పంక్తుల మధ్య తారాడుతూ ఉంటాడు. ఈ 'మార్గం తప్పటం' నుండి అతన్ని రక్షించవచ్చు, అయితే మొదటే కొన్ని విషయాలు అతనికి తప్పని సరిగా తెలుపవలసి ఉంటుంది. నీవు పఠించబోయ్యే గ్రంథం యావత్తు ప్రపంచ సాహిత్యంలో దాని కోవకు చెందిన ఏకైక గ్రంథం.

దాని సాహిత్య శైలి లోక గ్రంథాలన్నింటికీ పూర్తిగా భిన్నమైనది. దాని ఇతివృత్తం, అందులో చర్చించబడిన విషయాలు, మరియు దాని కూర్పు రీత్యా కూడా అది అపూర్వమైన గ్రంథరాజం. అందువేత ఇంతవరకు నీవు చేస్తూ వచ్చిన పుస్తక పఠనం వల్ల ఏర్పడిన 'గ్రంథం' భావన ఈ మహత్తర గ్రంథాన్ని అర్థం చేసుకునేందుకు ఏ విధంగానూ దోహదపడదు. పైగా దీన్ని అర్థం చేసుకోవటానికి నీవు చేసే కృషిలో ఆటంకాలు సృష్టిస్తుంది. ఈ గ్రంథాన్ని అర్థం చేసుకోవాలనే అభిలాషే నీకు ఉంటే, నీవు ముందే ఏర్పరచుకున్న ఊహలన్నింటికీ స్వస్తి చెప్పి దీని అపూర్వమైన విశేషాలను పరిచయం చేసుకోవాలి.

## దైవ మార్గదర్శకత్వం

ఈసందర్భంలో పాఠకుడు అన్నింటికంటే ముందు ఖురాన్ ప్రాతిపదికను, దాని మూలాన్ని తెలుసుకోవాలి. అతడు విశ్వసించినా, విశ్వసించకపోయినా, ఖురాన్‌ని అర్థం చేసుకునేందుకు ప్రారంభాంశంగా, దానికి ఏ ప్రాతిపదికను, ఏమూలాన్ని స్వయంగా ఈ గ్రంథం, మరియు దీన్ని అందజేసిన చివరి దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) సూచించారో దాన్నే స్వీకరించడం అవసరం :

1. సర్వ సృష్టికికర్త, స్వామి, పాలకుడు అయిన విశ్వప్రభువు తన అనంత రాజ్యంలోని ఒకభాగమైన ఈ భూమిపై మానవుణ్ణి సృష్టించాడు; అతనికి తెలుసుకునే ఆలోచించే, అర్థంచేసుకునే శక్తుల్ని ప్రసాదించాడు; మంచి, చెడుల విచక్షణాజ్ఞానాన్ని అనుగ్రహించాడు; ఎన్నిక, సంకల్పం, ఆచరణల స్వేచ్ఛను ప్రదానం చేశాడు; తనచుట్టూ ఉన్న వస్తువుల్ని వినియోగించుకునే అధికారం ఇచ్చాడు; మొత్తంమీద ఒకవిధమైన స్వయం ప్రతిపత్తి (Autonomy) ని ఇచ్చి అతన్ని భువిలో తన ప్రతినిధి (ఖలీఫా) గా నియమించాడు.

మానవుణ్ణి తన ప్రతినిధిగా నియామకం చేసినప్పుడే. అతడు తనతో ఎలాంటి సంబంధాలు కలిగి ఉండాలో అతిస్పష్టంగా తెలియజేశాడు. విశ్వప్రభువు: "నేనే మీకూ, ఈ విశ్వానికంతటికీ స్వామిని. ఆరాధ్యుణ్ణి, పరిపాలకుణ్ణి. నా ఈ రాజ్యంలో మీరు సర్వాధికారులూ కారు, ఇతరుల బానిసలూ కారు. నేను తప్ప మరొకరెవ్వరూ మీరు పాటించే విధేయతకు, దాస్యానికి, మీ ఉపాసనకు అర్హులు కారు. ఈ ప్రాపంచిక జీవితంలోకి మిమ్మల్ని అధికారాలిచ్చి పంపడం జరుగుతోంది. ఇది వాస్తవానికి ఒక పరీక్షా సమయం. తరువాత మీరు మళ్ళీ నావద్దకే మరలి రావలసి ఉంటుంది. అప్పుడు నేను మీ కార్యకలాపాలను పరిశీలించి ఈ పరీక్షలో ఎవరు నెగ్గారో, ఎవరు నెగ్గలేదో నిర్ణయిస్తాను.

"మీరు అనుసరించవలసిన నిజ వైఖరి ఏదంటే మీరు నన్ను మీ ఏకైక ఆరాధ్యునిగా, పాలకునిగా స్వీకరించాలి. నేను పంపే ఆజ్ఞలకు అనుగుణంగా ప్రపంచంలో జీవితం గడపాలి. ప్రపంచాన్ని పరీక్షారంగంగా భావిస్తూ, నేను చెయ్యబోయే చివరి తీర్పులో సాఫల్యం పొందటమే మీ జీవిత పరమార్థమనే స్పృహతో జీవితం గడపాలి. ఈ వైఖరికి భిన్నంగా ఉన్న ప్రతి వైఖరీ తప్పుడు వైఖరే, మీరు ఈ వైఖరిని అవలంబిస్తే, (ఆ విధంగా చేసే స్వేచ్ఛ మీకు ఉంది) మీకు ఇహలోకంలోనూ సుఖశాంతులు సంప్రాప్త మవుతాయి, నా వద్దకు మరలి వచ్చినప్పుడూ నేను మీకు శాశ్వత సౌఖ్యం, చిరకాల ఆనందాల నిలయమయిన స్వర్గాన్ని ప్రసాదిస్తాను. ఇది కాక మరే ఇతర వైఖరిని అవలంబించినా (దాన్ని అవలంబించే స్వేచ్ఛ కూడా మీకు ఉంది) మీరు ప్రపంచంలో అశాంతి, అరాచకాలను చవిచూడవలసి ఉంటుంది. ఇహాన్ని వదలి పరలోకాన్ని చేరినప్పుడు కూడా

శాశ్వత దుఃఖం, శాశ్వత బాధల అఖాతం అయిన నరకంలో మిమ్మల్ని పడవేయటం జరుగుతుంది"

3. ఇలా విశద విశ్వ ప్రభువు మానవాళికి భువిలో చోటిచ్చాడు, మానవ జాతికి తొలిజంట అయిన ఆదం హవ్వాలకు (అల్లాహ్ వారిపై శాంతిని వర్షింపజేయు గాక) వారూ వారి సంతతి ప్రపంచంలో పాటించవలసిన మార్గ దర్శకత్వాన్ని కూడా అనుగ్రహించాడు. ఈ ఆది మానవులు అజ్ఞానపు అంధకారంలో జన్మించ లేదు–దైవం ధరణిపై వారి జీవితాన్ని ప్రారంభం చేసింది విజ్ఞానపు వెలుతురులోనే. యదార్ధం ఏమిటో వారికితెలుపటం జరిగింది. వారు అనుసరించవలసిన జీవిత నియమావళిని కూడా వారికి చూపడం జరిగింది. అదే ఇస్లాం, దైవాజ్ఞాపాలన, దైవ విధేయత. ఆదం హవ్వాలు తమ సంతానానికి దైవ విధేయులుగా ముస్లింలుగా జీవించాలనే బోధించారు. తరువాత వచ్చిన శతాబ్దాల్లో క్రమక్రమంగా మానవులు సవ్యమైన జీవిత విధానానికి (ఇస్లాం ధర్మానికి) విముఖులయి వివిధ తప్పుడు విధానాల వైపుకు పరుగుతీశారు. వారు ఆ జీవిత విధానాన్ని తమ అలక్ష్యం కారణంగా కోల్పోయ్యారు; తమ చెడునడత మూలంగా దాన్ని వికృతం చేశారు. భూనభాంతరాల్లోని విభిన్న మానవ మానవేతర శక్తుల్ని, కాల్పనిక, భౌతిక వస్తువుల్ని వారు అల్లాహ్‌కు సహవర్తులుగా ఎంచసాగారు. దైవం ప్రసాదించిన 'వాస్తవికతా జ్ఞానం'లో రకరకాల మూఢ నమ్మకాలను, సిద్ధాంతాలను, తత్వాలను కలిపి వారు అసంఖ్యాకమయిన మతాలను సృష్టించుకున్నారు. దైవం నిర్ణయించిన, న్యాయమయిన నైతిక నాగరిక సూత్రాలను త్రోసిరాజని లేదా వాటిని వికృతం చేసి, తమ మనో కాంక్షలకు, దురభిమానాలకు అనువైన జీవిత నియమాలను చేసుకున్నారు. వీటి ద్వారా అల్లాహ్ ధరణిలో దౌర్జన్యం ప్రబలిపోయింది.

4. అల్లాహ్ తన సృష్టికి సంబంధించిన శక్తి మార్గభ్రష్టులైన

ఈ మానవుల్ని బలాత్కారంగా ఋజుమార్గ వైపుకు మళ్ళించ లేదు. ఎందుకంటే ఇలా చెయ్యటం, ఆయన మానవునికి ప్రదానం చేసిన పరిమిత స్వేచ్ఛా ప్రతిపత్తికి వ్యతిరేకమవుతుంది. అదేవిధంగా, ద్రోహం, ధిక్కారం, విజృంభించగానే ఆయన వారిని హతమార్చలేదు. ఎందుకంటే, భూమిపై మానవజాతికి దాని విభిన్న జాతులకు ప్రపంచంలో మనుగడ సాగించడానికి ఆయన నిర్ణయించిన గడువుకు ఇది పూర్తిగా విరుద్ధమవుతుంది. అయితే అదినుంచే ఒక బాధ్యతను ఆయన తనపై వేసుకున్నాడు. అది, మానవుని స్వేచ్ఛాధికారాలను కొనసాగనిస్తూ అతని ఆచరణా వ్యవధి (జీవిత కాలం)లోనే అతని మార్గదర్శకత్వానికి ఏర్పాట్లను చేస్తూ ఉండటం. కాగా, తాను స్వయంగా వేసుకున్న ఈ బాధ్యతా భారాన్ని నిర్వహించటానికి, ఆయన మానవుల్లో నుంచే తనను విశ్వసించే వారిని, తన అభీష్టానికి అనుగుణంగా నడచుకునే వారిని వినియోగించుకోవటం ప్రారంభించాడు. ఆయన వారిని తన దౌత్య ప్రతినిధులుగా నియమించాడు; తన సందేశాలను వారివద్దకు పంపాడు; వారికి వాస్తవికతా జ్ఞానాన్ని ప్రసాదించాడు; వారికి నిజమయిన జీవిత నియమావళిని అనుగ్రహించాడు. మానవులు తమ అశ్రద్ధ వల్ల ఏ ఋజుమార్గం నుండి తొలగిపొయ్యారో దాని వైపుకు మళ్ళడానికి వారికి పిలుపు నిచ్చే బాధ్యతను ఆయన వారికి అప్పగించాడు.

5. ఈ దైవ సందేశహరులు వివిధ జాతుల్లో విభిన్న దేశాల్లో ప్రభవించారు వేలాది సంవత్సరాల వరకు వేలాది సంఖ్యలో వారి ఆవిర్భావం జరుగుతూనే వచ్చింది. వారందరి ధర్మం ఒక్కటే; అంటే మానవుడికి ఆదిలోనే తెలుపబడిన ఋజుమార్గం. వారంతా ఒకే మార్గదర్శకత్వాన్ని అనుసరించారు; అంటే సృష్టి ప్రారంభంలోనే మానవులకై నిర్ణయించబడిన శాశ్వత నైతిక, నాగరిక సూత్రాలు. వారందరి జీవితధ్యేయం

కూడా ఒక్కటే—ఆ ధర్మం వైపుకు, ఆ మార్గదర్శక కాంతివైపుకు తోటి మానవుల్ని ఆహ్వానించటం, ఈ సందేశాన్ని స్వీకరించిన వారిని సంఘటిత పరచటం, వారి ద్వారా స్వయంగా దైవాజ్ఞా పాలనచేస్తూ, దైవ విధేయతా వ్యవస్థను స్థాపించి, దైవశాసనాలను ఉల్లంఘించడాన్ని ప్రతిఘటించ గలిగే ఒక 'ఉమ్మత్' ను (అనుచర సంఘాన్ని) సమాయత్తపరచటం. దైవప్రవక్తలు తమ తమ కాలాల్లో ఈ ధ్యేయ సాధనకై ఎంతో చక్కగా కృషి చేశారు. కాని నిత్యం అత్యధిక ప్రజలు వారి సందేశాన్ని స్వీకరించటానికే ముందుకు రాలేదు. కొందరు దాన్ని స్వీకరించి ముస్లిం సమాజంగా రూపొందినా వారు కూడా క్రమేణ భ్రష్టు లయ్యారు చివరికి కొన్ని సమాజాలవారు దైవోపదేశాలను పూర్తిగా కోల్పోయారు; కొన్ని సమాజాల వారు దైవ బోధనల్లో మార్పులు చేర్పులు చేసి వాటిని వికృతం చేశారు.

6. చివరికి విశ్వప్రభువు అరేబియాలో ముహమ్మద్ (సఅసం) ను ఎంపిక చేశాడు. గతించిన ప్రవక్తలందరూ ఏ కార్యనిర్వహణకై వచ్చేశారో దానికొరకే ఈయన్ని ప్రభవింప జేశాడు. ఆయన (మహాప్రవక్త ముహమ్మద్, సామ్యా ప్రజలను పూర్వపు ప్రవక్తల మార్గభ్రష్టులైన అనుచరులనూ సంబోధించారు. అందరినీ ఋజు మార్గం వైపుకు పిలవడం, అందరికీ సరికొత్తగా దైవాదేశాలను అందజేయటం, ఎవరయితే ఈ సందేశాన్నీ, మార్గదర్శకత్వాన్నీ స్వీకరిస్తారో వారిని, వారు స్వయంగా తమజీవితవ్యవస్థను దైవాదేశాల కనుగుణంగా స్థాపించుకుంటూ, లోక సంస్కరణకై నిరంతర కృషిచేసే 'అను చర సంఘం'గా రూపొందించడం ఆయనకర్తవ్యం. ఈ సందేశం ఈ మార్గదర్శకత్వం, ఈ ఆదేశాలుకల గ్రంథమే అల్లాహ్ మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) పై అవతరింప చేసిన 'దివ్య ఖురాన్'.

## ప్రధాన విషయం

ఖురాన్‌యొక్క ఈ ప్రాతిపాదికను, ఈ మూలాన్ని తెలుసుకున్న తరువాత దాని ఇతివృత్తాన్ని, అందులోని ప్రధాన విషయాన్ని, దాని లక్ష్యాన్ని అర్థంచేసుకోవటం సులువవుతుంది.

అసలు వాస్తవికత దృష్ట్యా మానవుని సఫలతా, నిష్ఫలతలు ఎందులో ఉన్నాయి అనే విషయం దృష్ట్యా మానవుడే దీని 'ఇతివృత్తం'.

భౌతిక దృష్టి, కాల్పనిక సిద్ధాంతాలు, మనోవాంఛల బానిసత్వం—వీటి మూలంగా మానవుడు దైవంగురించి, విశ్వవ్యవస్థను గురించి తన ఉనికీ, తన ప్రాపంచిక జీవితాలను గురించి ఏర్పరుచుకున్న దృక్పథాలు, వాటి ఆధారంగా అతడు అవలంబించిన వైఖరులు, అన్నీ అసలు వాస్తవికత దృష్ట్యా ఎంతో లోపభూయిష్టమైనవి. పరిణామం దృష్ట్యా స్వయంగా మానవునికే ఎంతో వినాశకర మైనవి. మానవుణ్ణి తన ప్రతినిధి (ఖలీఫా) గా నియమిస్తూ అల్లాహ్ స్వయంగా సూచించినదే అసలు వాస్తవికత. ఈ వాస్తవికత దృష్ట్యా పైన "నిజ వైఖరి" గా నిర్వచించబడిన వైఖరే మానవుని మనుగడకు సరిఅయినదీ, సత్ఫలితాన్ని చేకూర్చేదీనూ, ఇదే ఖురాన్‌లోని 'ప్రధాన విషయం,'

మానవుణ్ణి 'ఆ నిజవైఖరి' వైపుకు ఆహ్వానించడం, మానవుడు తన ఉపేక్షవల్ల కోల్పోతూ, తన నైచ్యం కారణంగా చెరిపివేస్తూ వచ్చిన దైవ మార్గదర్శకత్వాన్ని స్పష్టంగా అందచెయ్యడం, దీని లక్ష్యం, దీని 'ఆశయం.'

పై మూడు ప్రాథమిక అంశాలను దృష్టిలో ఉంచుకుని ఎవరయినా ఖురాన్‌ను అధ్యయనం చేస్తే, వారికి ఈ విషయాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి:

ఈ గ్రంథం దాని ఇతివృత్తం నుండి, దాని ఆశయం నుండి దాని ప్రధాన విషయం నుండి ఇసుమంతయినా తొలగలేదు. ఒకే హారంలోని రకరకాల, రంగు రంగుల వజ్రాలు పొందికగా, పటిష్టంగా పొదగబడి ఉన్నట్లే ఖురాన్‌లోని అనేక ఉప విషయాలు తొలినుంచి తుదివరకు దాని ప్రధాన విషయంతో పెనవేసుకుని ఉన్నాయి. ఖురాన్, భూమ్యాకాశాల నిర్మాణాన్ని మానవ సృష్టిని, సృష్టిలోని నిదర్శనల పరిశీలనను, గతించిన మానవ జాతి చరిత్రను ప్రస్తావిస్తుంది; విభిన్న మానవ సమాజాల విశ్వాసాలను, నీతి నియమాలను, ఆచార వ్యవహారాలను విమర్శిస్తుంది; లోకోత్తర విషయాలను, సమస్యలను విశదీకరిస్తుంది; ఇంకా ఎన్నో విషయాలను కూడా చర్చిస్తుంది. కాని భౌతిక శాస్త్రాన్ని, చరిత్రను, తత్వశాస్త్రాన్ని, లేక ఇంకేదయినా శాస్త్రాన్ని గాని, కళనుగాని మానవుడికి బోధించడం దాని లక్ష్యం కాదు. దీని లక్ష్యం కేవలం సృష్టి వాస్తవికత పట్ల మానవుడికున్న అపార్థాలను తొలగించటం, అసలు యదార్థాన్ని సుబోధకం చెయ్యడం, వాస్తవికతకు విరుద్ధమైన వైఖరిని అవలంబించటంవల్లకలిగే కీడును, చెడు పరిణామాలను వివరించటం, వాస్తవికతకు అనుగుణంగా ఉన్న, మంచి పరిణామానికి దోహదం చేసే వైఖరివైపుకు మానవుల్ని ఆహ్వానించటం ఈ కారణంచేతనే దాని లక్ష్యానికి అవసరమైన మేరకు అనువైన పంథాలో మాత్రమే, ప్రతి విషయాన్ని అది ప్రస్తావిస్తుంది. ఈ విషయాలను తన అవసరం మేరకు ప్రస్తావించి తరువాత సందర్భశుద్ధిలేని వివరాలను వదిలేసి, అది దాని ఆశయం వైపుకు, దాని ప్రధాన విషయం వైపుకు మళ్ళుతుంది. ఇక దాని వివరణలు 'ప్రధాన సందేశం' చుట్టూ ఎంతో పొందికగా, మనోజ్ఞంగా పరిభ్రమిస్తూ ఉంటాయి.

## పూర్వరంగం

ఖురాన్ శైలిని, దాని క్రమాన్ని, అందులోని ఎన్నో విషయాలను క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలంటే, దాని అవతరణా విధానాన్ని,

అది అవతరించిన కాలం నాటి సామాజిక చారిత్రక పరిస్థితుల్ని వాటి వెనుక ఉన్న గాథల్ని అవగాహన చేసుకోవటం తప్పనిసరి.

అల్లాహ్ దాన్ని ఒకేసారి రచించి, 'దీన్ని ప్రచురించి ప్రజల్ని ఒక ప్రత్యేక జీవిత విధానం వైపుకు పిలువమ'ని ముహమ్మద్ (సఅసం) ను ఆజ్ఞాపిస్తూ ఇచ్చిన గ్రంథం కాదు ఖురాన్. ఇంకా, దాని ఇతివృత్తాన్ని, దాని ప్రధాన విషయాన్ని ఓ క్రమమయిన రచనా పంథాలో, చర్చించిన గ్రంథం కూడా కాదు ఖురాన్. అందువల్లనే, ఖురాన్‌లో ఒక రచనా క్రమంగాని, ఒక సామాన్య పుస్తక శైలిగాని కానరాదు. అసలు విషయం ఏమిటంటే. అల్లాహ్ అరేబియా దేశం లోని ఒక నగరం మక్కాలో తన దాసుణ్ణొకణ్ణి ప్రవక్తా పదవికి ఎన్నుకున్నాడు. ఆ దాసుణ్ణి తన సొంత పట్టణంలో, అందునా తన సొంత తెగ (ఖురైష్) లో సందేశ ప్రచారం ప్రారంభించాలని ఆదేశించాడు. ఈ సందేశ ప్రచార కార్యం మొదలెట్టడానికి ప్రారంభంలో ఏ ఆదేశాలు అవసరమో వాటినే ప్రోక్తం చెయ్యటం జరిగింది. అవి ఇతోధికంగా మూడు ముఖ్య విషయాలను ఆవహించి ఉన్నాయి:

## మక్కాలో అవతరించిన సూరాలు

మొదటిది, ఈ మహత్తర కార్య నిర్వహణ కొరకు దైవప్రవక్త ఏ విధంగా సమాయత్తం కావాలో, ఏ పంథాలో పని చెయ్యాలో దైవ ప్రవక్తకు బోధించటం.

రెండోది, అసలు యదార్థానికి సంబంధించిన ప్రాథమిక విషయాలను బోధపరచడం, పరిసర ప్రాంతాల్లో నివసించే ప్రజల వైఖరి, యదార్థం పట్లగల ఏ అపార్థాల కారణంగానైతే అపసవ్యంగా తయారయిందో వాటిని సమగ్రంగా ఖండించటం.

మూడోది, "నిజ వైఖరి" వైపుకు ప్రజల్ని ఆహ్వానించటం, మానవ జీవిత సాఫల్యం, మానవుడి శుభ శ్రేయాలు ఏ మౌలిక నీతి సూత్రాల అనుసరణపై ఆధారపడి ఉన్నాయో ఆ దైవధర్మ సూత్రాలను వివరించటం.

ప్రారంభంలో ఈ సందేశాలు ఇస్లామీయ ఉద్యమ ప్రారంభ దశకు అనువైన విధంగా కొన్ని చిన్న చిన్న క్లుప్తమయిన వచనాల రూపంలో అవతరించేవి. వాటి భాష అతి స్వచ్ఛమయినదిగా, అత్యంత మధురమయినదిగా హృదయాన్ని హత్తుకునేదిగా, సంబో ధిత ప్రజల అభిరుచికి తగిన రీతిలో మనోహర సాహిత్య శైలిని ప్రతి బింబించేదిగా ఉండేది—ఈ తీయని పలుకులు హృదయాంతరాళా ల్లోకి శరవేగంతో చొచ్చుకుపోవాలని, వీనులు వీటి రాగ సుధకు పరవ శిస్తూ పరుగిడి రావాలని, వీటి మనోహర మధుర స్వరాలకు జిహ్వాలు తన్మయత్వంలో మునిగి వాటిని ఆలాపించాలని !

వీటిలో స్థానిక విషయాల ప్రస్తావన అధికంగా ఉండేది. విశ్వ జనీన సత్యాలనే అవి వివరించినా, వాటి ఆధారాలు, తార్కాణాలు, నిదర్శనాలు—సమస్తం సంబోధిత ప్రజలకు సుపరిచితమయిన పరిస్థి తుల నుండి, పరిసర ప్రాంతాల నుండి గ్రహించబడేవి. వారికి బోధ పడాలనీ, వారిని ప్రభావితం చెయ్యాలనీ, వారి చరిత్రనే, వారి ఇతిహా సాన్నే, వారి అనుదినం అనుభవంలోకి వచ్చే నిదర్శనాలనే ఎల్ల ప్పుడూ ప్రస్తావించటం జరిగేది; వారి విశ్వాసాల్లోని, వారి నైతికత లోని, వారి సామూహిక జీవితంలోని చెడులనే చర్చించటం జరిగేది

ఈ ఉద్యమ ప్రారంభ దశ దాదాపు నాలుగైదు ఏళ్ళ వరకు సాగింది. ఈ దశలో మహా ప్రవక్త (సఅసం) చేసిన ధర్మ ప్రచారా నికి ఫలితం మూడు రూపాల్లో కనిపించింది:

1. కొందరు సజ్జనులు ఈ సందేశాన్ని స్వీకరించి 'ఉమ్మతె ముస్లిమ' (ముస్లిం సమాజం) గా రూపొందటానికి సంసిద్ధులయ్యారు.

2. ఎక్కువ మంది ప్రజలు, అజ్ఞానం, లేక స్వార్థ ప్రియత్వం, లేక తాత ముత్తాతల ఆచారం పట్ల ఉన్న అభిమానం కారణంగా వ్యతి రేకించటానికే నిర్ణయించు కున్నారు.

3. మక్కా నగరం, ఖురైష్ తెగల సరిహద్దుల్ని దాటి ఈ నూతన సందేశం ఇంకా సువిశాల పరిధుల్లో ప్రతిధ్వనించసాగింది.

తరువాత ఈ ఉద్యమం రెండో దశ ప్రారంభ మవుతుంది. ఈ దశలో ఇస్లామీయ ఉద్యమానికి, పురాతాన మూఢత్వానికీ మధ్య ఎంతో తీవ్రమయిన అత్యంత మనోవిదారకమయిన సంఘర్షణ ప్రారంభమయింది. ఈ సంఘర్షణ దాదాపు తొమ్మిది ఏండ్ల వరకు కొన సాగింది. కేవలం మక్కాలోను, ఖురైష్ తెగవారే కాక, అరేబియాలోని అత్యధిక భాగాల్లోనూ ప్రాచీనమూఢ వ్యవస్థ సజీవంగా ఉండాలని కోరే ప్రజలు కూడా ఈ ఉద్యమాన్ని రూపుమాపడానికి ఒడిగట్టారు; దీన్ని అణచి వెయ్యటానికి కుయుక్తులన్నీ ప్రయోగించారు. దానికి వ్యతిరేకంగా దుష్ప్రచారం చేశారు, దానిపై ఆరోపణలు, ఆక్షేపణలు, అనుమానాల అగ్ని వర్షం కురిపించారు; దానిపట్ల ప్రజాసామాన్యం హృదయాల్లో రక రకాల సందేహాలను సృష్టించారు; తెలియనివారు తటస్థ పడితే వారు మహా ప్రవక్త (సఅసం) బోధలు వినకుండా అడ్డంకులు కల్పించారు; ఇస్లాం స్వీకరించే వారిపై ఘోరమైన అత్యాచారాలు చేశారు; వారిని యాతనలకు గురి చేశారు; వారిని సాంఘికంగా, ఆర్థికంగా బహిష్కరించారు; వారిని ఎంత దారుణంగా హింసించారంటే, వారిలోని చాలా మంది రెండు సార్లు తమ స్వదేశాన్ని వదలి అబిసీనియాకు వలస పొయ్యారు. చివరికి మూడోసారి వారంతా మదీనా పట్టణానికి వలస పోవలసి వచ్చింది. అయితే, ఇటువంటి తీవ్రమయిన, అనుదినం తీవ్రతర మవుతూ పోయిన ప్రతిఘటన, కొనసాగుతున్నప్పటికీ, ఉద్యమం వ్యాప్తి చెందుతూనే పోయింది. అప్పుడు ఏ ఒక్కరయినా ఇస్లాం స్వీకరించని ఒక కుటుంబమయినా, ఒక ఇల్లయినా మక్కాలో మిగల్లేదు. ఇస్లాం వ్యతిరేకుల వైషమ్యంతో నిండిన విషానికి, తీవ్రతకు ఎక్కువగా కారణభూతమయిన విషయం ఏమిటంటే, వారి సొంత సోదరీ సోదరులు, కొడుకులూ కూతుళ్ళూ, మామా అల్లుళ్ళూ మొదలయిన బంధువులు ఇస్లాం సందేశాన్ని స్వీకరించి దాన్ని అనుసరించటమే కాక, దాని కొరకు వారు తమ ప్రాణాలను సైతం త్యాగం చెయ్యగల అభిమానులుగా తయారవడం, అందునా స్వయంగా తమకు ప్రియ

మయిన అప్పులే తమతో తలపడటానికి పూనుకోవటం—ఈ విషయాలు వారిని మరీ రెచ్చగొట్టాయి. చిత్రమేమిటంటే, పురాతన మూఢత్వంతో తెగదెంపులు చేసుకుని ఈ కొత్త ఉద్యమంలో చేరే వారంతా పూర్వం కూడా సమాజంలో సజ్జనులుగా, ఉత్తములుగా పరిగణించ బడే వారే. ఈ ఉద్యమంలో చేరిన తరువాత వారు ఎంతో రుజు వర్తనులుగా సత్య సంధులుగా, సద్గుణ సంపన్నులుగా, తమ వ్యక్తి త్వాన్ని తీర్చి దిద్దుకున్నారు. ఇలాంటి వ్యక్తుల్ని ఆకర్షించి వారిని ఈ విధంగా రూపొందిస్తున్న ఈ సందేశం మహత్తును, గొప్ప తనాన్ని ప్రపంచం గుర్తించకుండా ఉండటం అసంభవం.

సుదీర్ఘమైన ఈ తీవ్ర సంఘర్షణా కాలంలో అల్లాహ్ సమయ సందర్భాలను బట్టి, అవసరానికి అనువుగా, తన ప్రవక్త (సఅసం) పై ఉత్తేజపూరితమయిన ఉపన్యాసాలను అవతరింప జేశాడు. వాటిలో, ప్రవాహాల్లాంటి ఉరవడి, వరదల్లాంటిశక్తి తీవ్రమయిన అగ్ని, జ్వాలల్లాటి ఉద్వేగం ఉండేవి. ఈ ప్రసంగాల్లో ఒకవైపు విశ్వసించిన వారికి వారి ప్రాథమిక విధులేవో తెలుపటం జరిగింది, వారిలో సామూ హిక, చైతన్యం ప్రదీప్తం చెయ్యబడింది, వారికి భయ భక్తుల్ని, ఉన్నత గుణగణాలను, పరిశుద్ధ స్వరూప స్వభావాలను పెంపొందించుకోవాలని బోధించటం జరిగింది. సత్య ధర్మాన్ని ప్రచారం చేసే విధానాలు తెలుపబడ్డాయి, విజయాన్ని చేకూర్చే వాగ్దానాలతో, పర లోకంలో సాఫల్యం ప్రసాదించే శుభవార్తలతో వారికి ధైర్యం చెప్పటం జరిగింది. ఓరిమితో నిలకడతో, తొణకని ధీమాతో అల్లాహ్ మార్గంలో కృషి చెయ్యాలని ఉత్తేజపరచటం జరిగింది. ఎలాంటి కష్టా న్నయినా సహించేందుకు, ఎంత గొప్ప వ్యతిరేకతనయినా ఎదుర్కొ నేందుకు. వారిలో ప్రాణాలొడ్డి కృషిచేసే అపూర్వమయిన ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని ప్రజ్వలితం చెయ్యడం జరిగింది. మరొకవైపు ఉద్య మాన్ని వ్యతిరేకించే వారినీ, రుజుమార్గం నుండి విముఖులయిన వారినీ, నిర్లక్ష్యపు నిద్రపొయ్యే వారినీ, వారు బాగా ఎరిగిన జాతుల ఇతిహాసం నుండి, అవి ఎలా ముగిశాయో ఎత్తిచూపడం జరిగింది. వారు నిత్యం

ప్రయాణించేసే మార్గాల్లోని శిథిలమై పోయిన పట్టణాల అవశేషాల ద్వారా గుణపాఠం గ్రహించాలని బోధించడం జరిగింది.

ఇంకా వారు రేయింబవళ్ళు భూమ్యాకాశాల్లో తమ చర్మచక్షువు లతో స్పష్టంగా చూచే, ఇంకా వారు స్వయంగా తమ జీవితాల్లోనూ నిత్యం తిలకించే, అనుభవించే ప్రస్ఫుటమైన నిదర్శనాల ద్వారా దేవుని ఏకత్వానికీ, మరణానంతర జీవితానికీ సంబంధించిన దృష్టాం తాలు, తార్కాణాలు సూచించబడ్డాయి; బహుదైవారాధన, సర్వ స్వతంత్రతా భావన పరలోక నిరాకరణ, పూర్వీకుల అంధానుకరణ మొదలైన విషయాల్లోని ఘోరమైన తప్పుల్ని ఏంతో స్పష్టమయిన ఆధారాల ద్వారా హృదయాన్ని హత్తుకుని మదిలో ముద్రవేసేలా విశదీకరించటం జరిగింది. వారి ఒక్కొక్క సంశయాన్ని దూరం చేసి, వారి ఒక్కొక్క అధిక్షేపణకు సమంజసమైన సమాధానం ఇవ్వబడింది. ఏ సమస్యల్లో నయితే స్వయంగా వారు ఇరుక్కున్నారో, లేదా ఏ చిక్కుల్లో వారు ఇతరుల్ని ఇరికించటానికి ప్రయత్నించేవారో వాటిని పరిష్కరించటం జరిగింది. మొత్తానికి మూఢత్వాన్ని నలువైపుల నుండి చుట్టుముట్టి, ఊపిరాడకుండా చేసి, దానికి విజ్ఞతా వివేకాల జగత్తులో నిలువ నీడ లేకుండా చెయ్యటం జరిగింది. ఇంకా వీటితో పాటు ఆ ఉపన్యాసాల్లో దైవాగ్రహం, ప్రళయ భీభత్సం, నరక బాధల వర్ణనల ద్వారా వారిని భీతిగొలపటం జరిగింది. వారి చెడు నడవడికను, వారవలంబించే తప్పుడు జీవిత విధానాన్ని, వారిని వెంటాడుతున్న మూఢాచారాలను నిశితంగా విమర్శించటం జరిగింది. వారనుసరిస్తున్న సత్యద్వేషం విశ్వసించినవారి పట్ల జరిపే హింసా వైఖరిని ఖండించి, అన్నికాలాల్లో దైవసమ్మతమైన ఉత్తమ సంస్కృతికి ప్రాతిపదికలయిన ముఖ్యమయిన మౌలిక సూత్రాలను సూచించటం జరిగింది.

ఈ దశలోనే ఇస్లామీయ ఉద్యమం ఎన్నో మలుపులు తిరిగింది. ప్రతి మలుపులోనూ సందేశం ఇతోధికంగా వ్యాప్తి కాసాగింది. ఇటు

కృషి, అటు దానికి అవరోధాలు రెండూ తీవ్రతర మయ్యాయి. విభిన్న నమ్మకాలు, వివిధ సంప్రదయాలు కల ప్రజలు ఎదురయ్యారు. దాని కనుగుణంగానే అల్లాహ్ పంపే ఉపదేశాల్లోనూ సందర్భోచితమైన వైవిధ్యం అధికమవసాగింది. ఇదీ ఖుర్ఆన్ మక్కా జీవితపు పూర్వ రంగం.

## మదీనాలో అవతరించిన సూరాలు

మక్కాలో ఈ ఉద్యమం ప్రారంభమై పదమూడేండ్లు గడచి పోయ్యాయి. ఆ తరుణంలో అకస్మాత్తుగా మదీనా నగర రూపంలో ఈ ఉద్యమానికి ఒక కొత్త కేంద్రం ప్రాప్తమయింది. అక్కడ అరేబియా భూభాగం నలు మూలల నుండి ఉద్యమ అనుయాయుల్ని సమీకరించి, దాని శక్తిని సంఘటిత పరచుకోవడం సాధ్యమయింది. కాగా, మహాప్రవక్త (సఅసం), ఇంకా ఎంతో మంది ఇస్లాం అనుయాయులు మదీనా పురానికి వలస పోయ్యారు. ఈ విధంగా ఈ ఉద్యమం మూడో దశలో ప్రవేశించింది. ఈ దశలో పరిస్థితుల రూపు రేఖలే మారిపోయ్యాయి. ముస్లిం అనుచర సమాజం (ఉమ్మతె ముస్లిమ) సక్రమంగా ఒక ప్రభుత్వానికి నాంది వెయ్యటంలో విజయం సాధించింది; పురాతన మూఢత్వపు ధ్వజవాహకులపై సాయుధ పోరాటం ప్రారంభమయింది. పూర్వపు ప్రవక్తల అనుయాయులు (యూదులు, క్రైస్తవులు) సయితం ఉద్యమాన్ని వ్యతిరేకించ నారంభించారు; ముస్లిం సమాజం అంతర్గత వ్యవస్థలోకి కపటులు (మునాఫిఖ్‌లు) ప్రవేశించారు; వారినికూడా ఎదుర్కోవలసివచ్చింది. ఈ విధంగా పదేళ్ళ అత్యంత తీవ్ర సంఘర్షణావస్థను అధిగమించి, ఈ ఉద్యమం చివరకు విజయ శిఖరాలను చేరుకోగలిగింది —అప్పుడు మొత్తం అరబ్బు దేశమే దానికి దాసోహమన్నది. విశ్వ వ్యాప్తంగా సంస్కరణా సందేశాల కవాటాలు తెరచుకున్నాయి.

ఈ దశలోకూడా ఎన్నో మలుపులు తారసపడ్డాయి. ప్రతిమలుపు లోనూ ఉద్యమానికి ప్రత్యేక అవసరాలు ఎన్నో ఎదురయ్యాయి.

ఈ అవసరాల కనుగుణంగా మహాప్రవక్త (సఅసం) పై అల్లాహ్ అవతరింపజేసిన ఉపన్యాసాల్లో ఎంతోవైవిధ్యం కానవచ్చేది. ఒకప్పుడు అవి జ్వాలలుక్రక్కే ఉద్వేగపూరిత మయిన ఉపన్యాసాల్లా అవతరిస్తే, మరొకప్పుడు అవి ప్రభువు జారీచేసే ఆజ్ఞలు ఫర్మానాల్లా సాక్షాత్కరించేవి. ఒకసారి ఆ ప్రసంగాల్లో ఉపాధ్యాయుని బోధనా శిక్షణా శైలి గోచరిస్తే, మరొకసారి సంస్కర్త చేసే ప్రబోధాల ధోరణి కానవచ్చేది. ఆ ఉపన్యాసాల్లో సమాజనిర్మాణాన్ని, రాజ్య వ్యవస్థీకరణను ఉత్తమ నాగరికతా స్థాపనను ఎలా చేపట్టాలో, జీవితపు విభిన్న విభాగాలను ఏ సిద్ధాంతాల, ఏ నియమాల ఆధారంగా తీర్చి దిద్దాలో, కపటుల (మునాఫిఖ్‌ల) తో ఎలా వ్యవహరించాలో, జిమ్మీల (ఇస్లామీయ రాజ్యరక్షణలో ఉన్న ముస్లిమేతరుల) పట్ల ఎటువంటి వైఖరిని అవలంబించాలో, గ్రంథం కలవారి (యూదులు, క్రైస్తవుల) తో ఎటువంటి సంబంధాలు పెట్టుకోవాలో, యుద్ధానికి సన్నద్ధులైన శత్రువుల పట్ల, ఒడంబడిక చేసుకున్న జాతుల పట్ల ఏ విధానాన్ని అనుసరించాలో, ఇంకా, సంఘటితమైన ఈ ముస్లిం సమాజం ప్రపంచంలో తనపై మోపబడిన దైవ ప్రాతినిధ్యపు బాధ్యతలను నిర్వహించటానికి ఏ విధంగా సన్నద్ధమవ్వాలో, మొదలైన ముఖ్యవిషయాల పట్ల సూచనలు ఇవ్వబడ్డాయి.

ఈ ఉపన్యాసాల్లో ఒకవైపున ముస్లింలను సుశిక్షితులుగా తీర్చిదిద్దే బోధలుండేవి; వారి బలహీనతల పట్ల వారిని హెచ్చరించడం జరిగేది, అల్లాహ్ మార్గంలో ధన ప్రాణాలతో శాయశక్తులా కృషిచేసేందుకు ఉత్తేజపరచడం జరిగేది, జయాపజయాల్లో కష్టసుఖాల్లో, కలిమిలేముల్లో భయ నిర్భయావస్థల్లో–అన్ని పరిస్థితుల్లోను–సందర్భానికి తగినవిధంగా నైతిక హితవులు బోధింపబడేవి. మహాప్రవక్త (సఅసం) తరువాత వారి స్థానంలో సందేశ సంస్కరణల ఈ బృహత్తర కార్యాన్ని నిర్వహించేందుకు తగిన విధంగా వారిని సమాయత్త పరచటం జరిగేది: మరొకవైపున విశ్వాస (ఈమాన్) పరధికి వెలుపల ఉన్న గ్రంథం కల వారికి, కపటులకు, ధర్మ ధిక్కారులకు, బహుదైవోపాసకులకు,

వారి వారి విభిన్న పరిస్థితులకు అనువైన రీతిలో బోధపరచడానికి, మృదువుగా సందేశంవైపుకు ఆహ్వానించడానికి, కఠినంగా హెచ్చరించ డానికి, హితోపదేశం చెయ్యటానికి, దైవాగ్రహంవల్ల లభించే శిక్షను గురించి వారిని భయపెట్టటానికి, గుణపాఠం గరిపే సంఘటనలు, సమాచారాల ద్వారా శిక్షణ గ్రహించేలా చెయ్యటానికీ ప్రయత్నం చెయ్యబడింది—ఇదీ మదీనా సూరాల పూర్వరంగం.

## శైలి

పై వివరణ వల్ల విశదమయ్యే దేమిటంటే, ఖురాన్ ఒక సందే శాత్మక ఉద్యమంతో పాటే అవతరించసాగింది. ఈ సందేశం ప్రారంభమై పరిపూర్ణత చెందేవరకు గల 23 సంవత్సరాల కాలంలో ఏ ఏ దశలు ఏ ఏ మలుపులు దాటిందో, ఆ పరిస్థితుల విభిన్న అవసరాలకు అనుగుణంగా ఖురాన్‌లోని విభిన్నభాగాలు అవతరిం చాయి. కనుక డాక్టరేట్ (ఆచార్య) పట్టాపొందే ఉద్దేశ్యంతో వ్రాసే పరి శోధనా పత్రంలో అనుసరించబడే రచనాక్రమం ఇటువంటి గ్రంథం లో సాధ్యపడదనే విషయం సుస్పష్టం. ఇంకా ఈ సందేశ ప్రగతికి అనువుగా అవతరించిన చిన్న పెద్ద ఖురాన్ భాగాలను చిన్న చిన్న పుస్తకాల రూపంలో ప్రచురించటం కూడా జరగలేదు. అవి ఉపన్యా సాల రూపంలో ప్రజలముందుకు వచ్చేవి, అలాగే ప్రజల్లో వ్యాప్తి నొందేవి, అందుచేత వాటి శైలి కూడా గ్రంథశైలి కాదు. అది ప్రసంగాల శైలి. ఈ ప్రసంగాలు సైతం ఒక ప్రొఫెసర్ గారి లెక్చర్ల మాదిరిగా కాక ఒక సందేశ ప్రదాత చేసే ఉపన్యాసాల తీరులో ఉండేవి—ఆయన మనస్సునూ, మస్తిష్కాన్నీ బుద్ధినీ వివేకాన్నీ, భావోద్వేగాలను ఆకర్షించవలసి ఉంటుంది. ఆయనకు వివిధ మన స్తత్వాల ప్రజలు తారసపడతారు. ఆయన తన సందేశ ప్రచారంలోను ఉద్యమాన్ని క్రియాత్మకంగా నడపడంలోను వివిధపరిస్థితుల్ని ఎదుర్కొనవలసి ఉంటుంది. ఇంకా ఆయన సాధ్యమైనన్ని విధాలుగా తన మాటను ఎదుటివారికి అర్థమయ్యేలా చెప్పటం వారి ఆలోచనా

జగత్తునే మార్చటం, వారి భావోద్రేకాల్లో సంచలనం సృష్టించటం, వ్యతిరేక శక్తుల్ని ఛిన్నాభిన్నం చెయ్యటం, సహచరుల సంస్కరణకు, సుశిక్షణకు తగిన ఏర్పాట్లు చెయ్యటం, వారిలో ఉత్తేజాన్ని, వజ్ర సంకల్పాన్ని సృజించటం, విరోధుల్ని ఆత్మీయులుగా, తిరస్కరించే వారిని స్వీకరించేవారుగా మార్చటం, ప్రత్యర్థుల వాదనలను ఖండించటం, వారి నైతికశక్తిని ఆత్మవిశ్వాశాన్ని నిర్మూలించటం వంటి పనుల్ని చెయ్యవలసి ఉంటుంది. అంటే ఒక సందేశ ప్రదాతగా ఒకఉద్యమ నాయకునిగా తప్పనిసరిగా చెయ్యవలసిన పనులన్నీ ఆయన చెయ్యవలసి ఉంటుంది. కనుకనే, ఈకార్యనిర్వహణ కొరకు అల్లాహ్ తన ప్రవక్త పై అవతరింపజేసిన ఉపన్యాసాల ప్రసంగ శైలి ఒక ఉద్యమానికి సముచిత మయిన రీతిలోనే ఉంది, వాటిలో కాలేజీ లెక్చర్ల శైలిని వెదకటం పొరపాటు.

దీన్ని బట్టే ఖురాన్‌లో ఇంత ఎక్కువగా విషయాల పునరుక్తి ఎందుకు ఉందో చక్కగా బోధపడుతుంది. ఒక సందేశానికి, ఒక ఆచరణాత్మక ఉద్యమానికి స్వాభావికంగా అవసరమయ్యే దేమిటంటే, అది ఎప్పుడు ఏదశలో ఉంటుందో, అప్పటికి, ఆ దశకు సంబంధించిన విషయాలనే చర్చించాలి. ఉద్యమం ఒక దశలో ఉన్నప్పుడు, భావి దశల మాటఎత్తకూడదు. కేవలం ఆదశకు వర్తించే విషయాలనే మళ్ళీ మళ్ళీ పునరావృతం చేస్తూ ఉండాలి. ఇలా కొన్ని నెలల వరకు లేదా కొన్ని సంవత్సరాల వరకు జరిగినా ఫరవాలేదు. అయితే ఒక విషయాన్ని మళ్ళీ మళ్ళీ వల్లించేటప్పుడు, ఒకే పద జలాన్ని- ఒకే శైలిని ప్రయోగిస్తే, దాన్ని విని విని చెవులు మొద్దుబారి పోతాయి. శ్రోతల్లో విసుగుదల జనిస్తుంది, అందుకే ప్రతిదశలోనూ పునరావృతం కాగల విషయాలను ప్రతిసారీ కొత్తపదాల్లో, సరికొత్త శైలిలో, సరికొత్త రీతితో చెప్పటం కూడా చాలా అవసరమే. అప్పుడే అవి మనోజ్ఞంగా హృదయాల్లో నాటుకుంటాయి. ఉద్యమంయొక్క ఒక్కొక్క దశ పటిష్టవంతం అవుతూ పోతుంది. దీనితోపాటు,

ఈ సందేశం ఏ విశ్వాసాల ఏ సిద్ధాంతాలపై ఆధారభూతమయి ఉందో అని తొలిమెట్టు నుండి చివరి గమ్యంవరకు సర్వకాల సర్వావస్థల్లోనూ, కనుమరుగవకుండా జాగ్రత్త పడాలి; అంతే కాదు, ఎట్టి పరిస్థితిలోను ఉద్యమం యొక్క ప్రతిదశలోనూ వాటి పునశ్చరణ జరుగుతూ ఉండాలి. ఈ కారణంవల్లనే, ఇస్లామీయ ఉద్యమం యొక్క ఒకదశలో అవతరించిన అన్ని సూరాల్లోనూ సామాన్యంగా ఒకే విధమైన విషయాలు, పదజాలాన్ని, శైలిని మార్చి మార్చి చెప్పటం జరిగింది. కానీ దేవుని ఏకత్వం, ఆయన గుణవిశేషాలు, పరలోకం, అక్కడ జరిగే పరీక్ష, అక్కడ లభించే శిక్షా బహుమానాలు, దైవ దౌత్యం, దైవగ్రంథం పట్ల విశ్వాసం, భయభక్తులు, సహన స్థైర్యాలు, అల్లాహ్‌పై భారంమోపటం, మొదలైన మౌలిక విషయాల పునశ్చరణ మాత్రం ఖురాన్ అంతటా కనిపిస్తుంది. ఎందుకంటే, ఉద్యమం ఏ దశలో ఉన్నా, వీటిపట్ల ఉపేక్షా భావం సహింపరానిదే. ఈ మౌలిక భావనలు ఏమాత్రం సడలినా, ఇస్లామీయ ఉద్యమం దాని నిజస్వరూపంలో ఒక్కడుగు కూడా ముందుకు పోగలిగేది కాదు,

## క్రమం

మక్కీ, మదనీ సూరాలను గురించి పై వివరణను శ్రద్ధగా పరిశీలిస్తే,ఖురాన్ అవతరించిన క్రమంలోనే దాన్ని మహాప్రవక్త (సఅసం) ఎందుకు సంకలనం చెయ్యలేదనే ప్రశ్న కూడ పరిష్కృత మవుతుంది.

సందేశం ప్రారంభమయి ఏ క్రమంలో పరిణామం చెందిందో, విస్తరించిందో, అదే క్రమంలో 23 ఏళ్ళ వరకు ఖురాన్ అవతరణ జరిగిందనే యదార్థం మనకు పై విషయాల అవలోకన ద్వారా తెలిసింది. ఇలా అవతరించిన ఖురాన్ భాగాలను, కేవలం సందేశ పరిణామ దశకే సముచితమయిన క్రమంలోనే, సందేశం పరిపూర్ణత చెందిన తరువాత కూడా కూర్చటం ఏ విధంగానూ భావ్యం

కాదనే విషయం ద్యోతకమవుతూనే ఉంది. ఇప్పుడయితే సందేశ పరిపూర్ణత పిదప ఉత్పన్నమయ్యే పరిస్థితులకు అనువయిన మరో క్రమమే ఎంతయినా అవసరం. ఎందుకంటే, ప్రారంభ కాలంలో ఖురాన్ సంబోధితులు ఇస్లాం గురించి ఏ మాత్రం తెలియని వారు. అందువల్లనే అప్పుడు ప్రాథమిక స్థాయినుండి బోధన, హితవు గరప డం జరిగింది. కాని సందేశ పరిపూర్ణత తరువాత, దాని సంబోధిత ప్రజలు ఆ సందేశాన్ని స్వీకరించి ఒక ఉమ్మత్ (అనుచర సంఘం) గా ఏర్పడిన వారు. వీరిపై మహాప్రవక్త (సఅసం) సైద్ధాంతికంగానూ, క్రియాత్మకంగానూ పరిపూర్ణంచేసి అప్పగించిన మహత్కార్యాన్ని మున్ముందుకు నడిపించే భారం మోపబడింది. ఇప్పుడు వీరు స్వయంగా తమ విద్యుక్త ధర్మాలేవో, తాము అనుసరించవలసిన జీవన నియమాలేవో, వెనుకటి ప్రవక్తల అనుచర సంఘాల్లో ఉత్పన్న మైన ఉపద్రవాలేవో తెలుసుకోవటం అనివార్యంగా ప్రాధాన్యత వహించింది. ఆ తరువాత వీరు ఇస్లాంను గురించి ఏమీ తెలియక అంధకారంలో పడివున్న మిగతా ప్రపంచానికి ఈ దైవోపదేశాన్ని అందజేయటానికి ముందుకు రావలసిన విషయమూ ప్రాధాన్యత వహించింది.

మరొక విషయం, ఖురాన్ ఎటువంటి గ్రంథమో మనిషి అర్థం చేసుకుంటే, ఒక్కొక్క కోవకు చెందిన విషయాలను ఒక్కొక్క చోట సమకూర్చటం ఈ గ్రంథం నైజానికే జతపడదనే యదార్థం దానంతట అదే అవగతమవుతుంది. ఈ గ్రంథం స్వభావం దృష్ట్యా కావలసింది ఏమిటంటే, పఠితలముందు, మక్కా దశలోని బోధల మధ్యన మదీనా దశలోని విషయాలు, మదీనా దశలోని ఉపన్యాసాల మధ్య మక్కా దశలోని ప్రవచనాలు, ప్రారంభంలోని సంభాషణలు చివరి హితోప దేశాల నడుమ, చివరి రోజుల్లోని ఆదేశాలు ప్రారంభం నాటి నిర్దేశా లతో పాటు మాటి మాటికీ వస్తూ ఉండాలి. ఎందుకంటే, ఇలా వస్తూ ఉంటేనే ఇస్లాం పరిపూర్ణ దర్శనం, సమగ్రరూపం పఠితల దృష్టిలో అనునిత్యం మసలుతూ ఉంటుంది, ఎట్టి పరిస్థితుల్లోనూ పాఠకుడు

ఒకే వైపుకు మొగ్గకుండా ముందుకు సాగిపోగలడు—ఇదీ ప్రస్తుతం మనకు గోచరించే ఖురాన్ కూర్పులోని మర్మహేతువు.

ఇక పోతే, ఖురాన్‌ను దాని అవతరణాక్రమంలో సంకలనం చేస్తే అది తరువాతి ప్రజలకు అర్థం కావాలంటే, ఖురాన్‌తో పాటు అది అవతరించిన చరిత్రను, దాని ప్రతి భాగంయొక్క అవతరణాస్థితి వివరాలను; అవతరణా సందర్భాన్ని, తదితర విషయాలనన్నింటినీ సంక్షిప్త వేసి ఖురాన్‌కు తోడుగా జతపరచవలసి ఉంటుంది. దాన్ని ఖురాన్‌కు ఒక అనుబంధంగా పెట్టడం అనివార్యమవుతుంది. అలా చెయ్యడం వల్ల అల్లాహ్ ఏ ఉద్దేశ్యంతో తన ఈ దివ్యవాణిని కూర్పు చేయించి భద్రపరిచే ఏర్పాటు చేశాడో, ఆ ఉద్దేశ్యం భంగమవుతుంది. ఎందుకంటే, స్వచ్ఛమైన, దైవవాణి, ఇతర రచనల ఎలాంటి కల్తీ జరగకుండా, దాని సమగ్ర, సంగ్రహ రూపంలో సంకలనం కావాలన్నదే అసలు ఉద్దేశ్యం. అది పిల్లలకు, పెద్దలకు, యువకులకు వృద్ధులకు, స్త్రీలకు, పురుషులకు, పల్లెవాసులకు, పట్టణవాసులకు, పండితులకు, పామరులకు అందరికీ అందుబాటులో ఉండాలని, అందరూ దాన్ని చదవగలగాలి అన్నదే ఆ ఉద్దేశ్యం. ఇంకా ప్రజలు ప్రతివేళా, ప్రతిచోటా, ప్రతినెలవులో దాన్ని చదవ గలగాలి. బుద్ధీ, జ్ఞానాలు ఏ స్థాయిలో ఉన్న మనిషి అయినా, అతడు కనీసం తన ప్రభువు తనను కోరేదేమిటో, కోరనిదేమిటో, తప్పని సరిగా తెలుసుకోగలగాలి. అలాంటప్పుడు ఈ దైవ ప్రవచనాలకు తోడుగా సుదీర్ఘమయిన చరిత్ర నొకదాన్ని జతపరచి దాని పఠనం కూడ తప్పనిసరే అనే నిబంధన ఉన్నట్లయితే, ఈ ఉద్దేశ్యం పూర్తిగా భంగమవుతుందన్న విషయం వ్యక్తమవుతూనే ఉంది.

అసలు విషయం ఏమిటంటే ఖురాన్ ప్రస్తుత క్రమాన్ని ఆక్షేపించేవారు, దాని ఉద్దేశ్యాన్ని, లక్ష్యాన్ని అసలు ఎరుగరు. పైగా ఈ సాహిత్యం, చరిత్ర, మానవశాస్త్రాల (humanities) అధ్యయనం చేసే

విద్యార్థుల కొరకు అవతరించిందనే అపోహకు కూడ వారు గురి అయినట్లు అనిపిస్తోంది.

ఖురాన్ కూర్పు క్రమాలను గురించి మరొక మాటనుకూడ పఠితలు తెలుసుకోవాలి. ఈ కూర్పు తరువాతివారు చేసింది మాత్రం కాదు. స్వయంగా అల్లాహ్ ఆదేశానుసారం మహాప్రవక్త (సఅసం) తానే ఈ కూర్పును చేశారు. దీనిగ్గాను అనుసరించిన పద్ధతి ఏమంటే ఏదయినా సూరా అవతరించినప్పుడు వెంటనే ఆయన తన లేఖకులలోని ఒకర్ని పిలిపించేవారు. దాన్ని సక్రమంగా గ్రంథస్థం చేయించిన తరువాత, ఈ సూరా ఫలానా సూరా తరువాత, ఫలానా సూరాకు ముందు అమర్చాలని ఆదేశించేవారు. అదే విధంగా, ఖురాన్‌లో కొంతభాగం మాత్రమే అవతరించినపుడు, దాన్ని ఒక ప్రత్యేక సూరాగా చెయ్యడం ఉద్దేశ్యం కాకపోతే, దాన్ని ఫలానా సూరాలో ఫలానా చోట గ్రంథస్థం చెయ్యాలని అయన ఆజ్ఞాపించేవారు. ఇంకా, అదే క్రమాన్ని నమాజ్ లోనూ, ఇతర సందర్భాల్లో ఖురాన్ చదివేటప్పుడు కూడా స్వయంగా మహాప్రవక్త (సఅసం) అనుసరించేవారు, అదే క్రమంలో సహాబా (రజి అన్) (మహాప్రవక్త సహచరులు) కూడ ఖురాన్‌ని కంఠస్థం చేసుకునేవారు. కనుక ఏ రోజైతే ఖురాన్ అవతరణ ముగిసిందో, అదేరోజున ఖురాన్ కూర్పు కూడ ముగిసింది అనే విషయం నిర్ధారిత చారిత్రక సత్యం. దాన్ని అవతరింప జేసిన దేవుడే దాని కూర్పు కూడ చేశాడు. ఎవరి హృదయ ఫలకంపై అది అవతరించిందో, ఆయన పవిత్ర హస్తాల మీదుగానే దాని కూర్పు చేయించడం కూడా జరిగింది. ఇందులో జోక్యం కలుగ జేసుకోవటం ఇతరులెవరి తరమూ కాదు.

కూర్పు

మొదటినుండే ముస్లింలపై నమాజ్* ఒక విధి కావడం వల్లనూ, నమాజ్‌లో ఖురాన్ పఠనం తప్పనిసరి అంశంగా నిర్ణయించబడటం వల్లనూ, ఖురాన్ అవతరణతో పాటే ముస్లింలు ఖురాన్‌ను కంఠస్థం చేసుకునే ఆచారం ప్రారంభమయింది. ఖురాన్ అవతరణ జరుగుతూ పోయిన కొద్దీ, ముస్లింలు దాన్ని కంఠస్థం చేసుకుంటూ పొయ్యారు. కనుక ఖురాన్ సంరక్షణ కేవలం మహాప్రవక్త (సఅసం) తన లేఖకుల ద్వారా గ్రంథస్థం చేయించిన ఖర్జూరపు ఆకులు, ఎముకలు, తోలు పొరలపై మాత్రమే ఆధారపడి ఉండలేదు. ఖురాన్ అవతరణ జరగగానే కొందరు వ్యక్తులు, ఆ తరువాత కొన్ని వందల మంది. ఆ తరువాత కొన్ని వేలమంది ప్రజలు, తరువాత కొన్ని లక్షల మంది దాన్ని తమ హృదయ ఫలకాలలో భద్రపరచుకున్నారు. ఇక ఏ షైతాన్ కయినా సరే దానిలోని ఒక్క అక్షరాన్ని కూడ తారుమారు చేసే ఆస్కారమే లేకుండా పోయింది.

మహాప్రవక్త (సఅసం) పరమపదించిన తరువాత, అరేబియాలో ఇర్తిదాద్ (ధర్మ పరిత్యాగం-apostasy) పెనుతుఫానులా విజృంభించి నపుడు, దాన్ని అణచటానికిసహాబా (రజి అన్) (ప్రవక్త సహచరులు) యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. అలా జరిగిన యుద్ధాల్లో ఖురాన్‌ను పూర్తిగా కంఠస్థం చేసుకున్న సహాబా (రజఅన్) చాలా మంది షహీద్ (అమరగతులు) అయ్యారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజఅన్) కు ఒక ఆలోచన తట్టింది. ఖురాన్ పరిరక్షణ విషయంలో

---

* ఐదుపూటలు నమాజ్ విధిగా చెయ్యాలన్న నియమమయితే మహాప్రవక్త ప్రభవించిన ఎన్నో ఏండ్లకు ఖరారయింది. కాని స్వతహాగా నమాజ్ మాత్రం తొలి నాటి నుండే విధిగా ఉంటూ వచ్చింది. నమాజ్ విధిగా లేకుండా మాత్రం ఇస్లాంలో ఒక్కక్షణ మయినా గడవలేదు.

ఒకే ఆధారాన్ని పూర్తిగా నమ్ముకోవడం శ్రేయస్కరం కాదు గనుక, హృదయ ఫలకాలపైననే కాకుండా, కాగితపు పుటలపై కూడా దాన్ని భద్రపరచే ఏర్పాట్లు చెయ్యటం అత్యంతావశ్యకం అని ఆయన భావించి, ఆ విషయాన్నే హజరత్ అబూబక్ర (రజిఅన్) కు తెలిపారు. మొదట ఆయన కొంత తటపటాయించినా తరువాత ఉమర్ (రజిఅన్) అభిప్రాయంతో ఏకీభవించారు. మహాప్రవక్త (సఅసం) కు లేఖకుడు (సెక్రటరీ) గా సేవచేసిన హజ్రత్ జైద్ బిన్ సాబిత్ (రజిఅన్) ఈ కార్య నిర్వహణకు నియమించబడ్డారు. దీనికి నిర్ణయించబడిన విధానమేమిటంటే, ఒకవైపున మహాప్రవక్త (సఅసం) వ్రాయించి పొందుపరచిన భాగాలన్నీ పోగుచెయ్యాలి. మరొకవైపున సహాబా (రజిఅన్) ల్లో ఎవరివద్ద నైనా పూర్తి ఖురాన్ లేక దాని భాగం ఏదయినా గ్రంథస్థం చెయ్యబడి ఉన్నట్లయితే, దాన్ని వారి వద్ద నుండి సేకరించాలి.* ఆ తరువాత ఖురాన్ హాఫీజ్‌ల (ఖురాన్ స్మర్తలు) సహకారం పొందాలి. ఈ మూడు ఆధారాల ఏకగ్రీవ సాక్ష్యంతో, పరిపూర్ణ స్వచ్ఛత సిద్ధించినట్లు తృప్తి కలిగినప్పుడే, ఖురాన్ యొక్క ఒక్కొక్క పదాన్ని ముస్‌హాఫ్ (ఖురాన్ మూల ప్రతి) లో గ్రంథస్థం చెయ్యాలి. ఈ నిర్ణయం మేరకు ఖురాన్ యొక్క ఒక ప్రామాణిక ప్రతిని తయారు చేసి విశ్వాసుల మాతృమూర్తి (ఉమ్ముల్ మోమినీన్) ** హజ్రత్ హఫ్సా (రజిఅన్) వద్ద భద్రపరచాను.

---

* మహాప్రవక్త జీవిత కాలంలోనే అనేక మంది సహాబా (రజిఅన్) పూర్తి ఖురాన్‌ను లేక దానిలోని కొన్ని భాగాలను గ్రంథస్థం చేసి తమ వద్ద పదిలపరచుకున్నట్లు నిర్ధారితమైన ఉల్లేఖనాలు ఉన్నాయి. ఈ సందర్భంలో ఈ మహనీయుల్ని పేర్కొనడం జరిగింది. ఉస్మాన్, అలీ, అబుల్లా బిన్ మసూద్, అబుల్లా బిన్ అమ్ర బిన్ ఆస్, సాలిం మౌలా హుజైఫా, జైద్‌బిన్ సాబిత్, మఆజ్ బిన్ జబల్, ఉబైబిన్ కఅబ్, అబూజైద్ (రజిఅన్).

** మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) సతీమణి.

అవసరమున్న వారు దాన్ని నకలు చేసుకోవటానికి లేదా దానితో పోల్చి చూసుకుని తమవద్ద నున్న ప్రతిని సరిదిద్దుకోవటానికి ప్రజలకు అనుమతి ఇవ్వబడింది.

## ఉచ్చారణా విభేదాలు

మనలో ఉన్నట్లే ఆ కాలంలో అరబ్బుల్లో కూడ ఉచ్చారణా విభేదాలు (యాసలు) ఉండేవి. మన దేశంలోని హిందీ, ఉర్దూ, తెలుగు, పంజాబి, బెంగాలి భాషల్లో—ఏ భాషలో నైనా సరే—ఒక మండలానికీ, మరో మండలానికీ ఒక పట్టణానికీ మరొక పట్టణానికి, ఉచ్చారణలో వ్యత్యాస మున్నట్లే, అరబ్బుల్లో కూడ విభిన్న ప్రాంతాల తెగల మధ్య ఈ వ్యత్యాసాలు ఉండేవి. మక్కాలోని ఖురైష్ ప్రజలు మాట్లాడే భాషలోనే ఖురాన్ అవతరించింది. అయితే ప్రారంభంలో ఇతర ప్రాంతాల, తెగల వాళ్ళకు తమ తమ ఉచ్చారణ యాసల్లో ఖురాన్‌ను పఠించే అనుమతి ఇవ్వబడింది. ఎందుకంటే, అంతమాత్రాన అర్థంలో ఏ విధమయిన భేదం వాటిల్లదు. ఆ విధంగా చదవటం వారికి సులభతరమవుతుంది. కాని క్రమేణా ఇస్లాం వ్యాప్తిచెందటం మూలానా అరబ్బులు తమ ఎడారి ప్రాంతాలను వదిలి ముందుకు సాగి ప్రపంచంలోని ఒక పెద్ద భూభాగాన్నే జయించారు. ఇతర జాతుల వాళ్ళు కూడా ఇస్లాం పరిధిలోకి రావటం ప్రారంభించారు. అరబ్బులు, అరబ్బేతరుల సమ్మేళనం భారీ ఎత్తున జరగటం మూలాన అరబీ భాష ప్రభావితం కాసాగింది. దీనివల్ల ఒక ప్రమాదం ఏర్పడింది. కనుక ఇప్పుడు కూడా ఖురాన్ పఠనంలో ఇతర యాసల్ని, ఉచ్చారణలను అనుమతిస్తే, అనేక ఉపద్రవాలు తలెత్తే అవకాశం ఉంది. ఉదాహరణకు, ఒక వ్యక్తి తన సొంత యాసలో ఖురాన్‌ను పఠిస్తూ వుంటే, మరొక అపరిచిత వ్యక్తి దాన్ని విని, అతడు దైవ వాణిలో బుద్ధిపూర్వకంగా ప్రక్షిప్తాలు చేస్తున్నాడని భావించి

అతనితో పోరాటానికి పాల్పడవచ్చు. లేదా ఈ ఉచ్చారణా విభేదాలు క్రమేపి నిజంగానే ప్రక్షిప్తాలకు దారి తీయవచ్చు. లేదా, అరబ్బు అరబ్బేతర జాతుల మిశ్రమం వల్ల భాష స్వచ్ఛతను కోల్పోయిన వారు తమ వికృత భాష కనుగుణంగా ఖురాన్‌లో మార్పులు చేసి దాని భాషా సౌందర్యాన్ని భంగపరిచే ప్రమాదం ఉంది. ఈ కారణాల వల్ల, కేవలం హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) ఆదేశానుసారం గ్రంథస్థం చేసి భద్రపరచబడిన ప్రామాణిక ఖురాన్ ప్రతి యొక్క నకళ్ళనే ఇస్లామీయ దేశాలన్నింటిలోనూ ప్రచురించాలని హజ్రత్ ఉస్మాన్ (రజి అన్), సహాబా మహనీయుల సలహా ప్రకారం నిర్ణయించారు. ఇతర యాసల్లో వ్రాయబడి ఉన్న ప్రతుల ప్రచురణను నిషేధించారు.

నేడు మన చేతుల్లో ఉన్న ఖురాన్, ఆనాడు హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) సమీకరించగా హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) అధికారికంగా అన్ని మహానగరాలకు ప్రచురణార్థం పంపిన, ప్రామాణికమైన ముస్‌హఫెసిద్ధీఖీ ప్రతికి అనురూపమే. నేటికీ ఆ ప్రామాణిక ఖురాన్ ప్రతులు ప్రపంచంలో పలుచోట్ల సురక్షితంగా ఉన్నాయి. ఎవరికైనా ఖురాన్ (ఏవిధమైన ప్రక్షిప్తాలు లేకుండా) సురక్షితంగా ఉందనే విషయంలో ఏమాత్రం సందేహమున్నా, వారు తమ సందేహ నివృత్తి కొరకు ఇలా చెయ్యాలి: పశ్చిమ ఆఫ్రికాలో ఏ పుస్తకాల దుకాణం నుండయినా ఖురాన్ ప్రతి నొకదాన్ని కొనాలి; జావాలో ఒక ఖురాన్ హాఫిజ్ నోట ఖురాన్‌ను పూర్తిగా విని ఆ ప్రతిని పోల్చి చూడాలి; తరువాత, ప్రపంచంలోని పెద్ద పెద్ద లైబ్రరీలకు వెళ్ళి అక్కడ హజ్రత్ ఉస్మాన్ (రజిఅన్) కాలంనుంచి నేటివరకు విభిన్న శతాబ్దాల్లో వ్రాయబడిన ఖురాన్ ప్రతులతో దాన్ని పోల్చి చూసుకోవాలి. ఇందులో, ఒక్క అక్షరం కాదు పొల్లు మందం కూడ తేడా గోచరిస్తే, ఈ మహత్తర 'చారిత్రక అవిష్కరణను' అతడు ప్రపంచానికి తప్పకుండా వెల్లడి చెయ్యవచ్చు. నిత్య శంకితుడెవడైనా ఖురాన్

దైవప్రోక్తమైన గ్రంథం అనటాన్ని సందేహించటం సాధ్యం కావచ్చు గాని, మనచేతుల్లో ఉన్న ఖురాన్ ఎలాంటి హెచ్చుతగ్గు ల్లేకుండా మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఆనాడు ప్రపంచానికి అందజేసిన గ్రంథమే అనే విషయం, ఏ విధమైన సందేహానికీ ఆస్కారం లేని చారిత్రక సత్యం. మానవ చరిత్రలో ఇలాంటి నిర్దుష్ట మైన సాక్ష్యాధారాలతో నిర్ధారితమైన దేదీ మరొకటి లేదు. ఎవరైనా దీని స్వచ్ఛతను శంకిస్తే వారు శంకించని విషయం ప్రపంచంలో ఉండదు. రోమను సామ్రాజ్యం అనేది ఒకప్పుడు ప్రపంచంలో విలసిల్లిందనీ, మొగల్ ప్రభువులు కూడా భారతదేశాన్ని ఒకప్పుడు పాలించారనీ, నెపోలియన్ అనే నియంతకూడా ప్రపంచంలో ఉండేవాడనీ, చరిత్ర చాటే సత్యాలనూ వారు శంకించగలరు. ఇలాంటి చారిత్రక సత్యా లను శంకించటం విజ్ఞానం కాదు, అజ్ఞానానికి తార్కాణం.

## అధ్యయనం

ప్రపంచంలో ఎందరో వ్యక్తులు ఎన్నో లక్ష్యాలతో ఖురాన్ అధ్యయనానికి పూనుకుంటారు. వీరందరి ఉద్దేశ్యాలను అవసరాలను దృష్టిలో ఉంచుకుని సలహాఇవ్వటం సాధ్యంకాదు. జిజ్ఞాసువుల ఈ సమూహంలోని, కేవలం దీన్ని అర్థం చేసుకోదలచిన వారు మరియు జీవితపు సమస్యల్లో ఈ గ్రంథం మానవునికి చూపే మార్గదర్శకత్వాన్ని తెలుసుకోగోరే వారి కొరకే నా తాపత్రయమంతా! ఇలాంటి వారికి ఖురాన్ అధ్యయనం కొరకు నేను ఇక్కడ కొన్ని సలహాలనిస్తున్నాను; ఈ సందర్భంలో సాధారణంగా ఎదురయ్యే చిక్కుల్ని విడదీయ టానికి ప్రయత్నిస్తున్నాను.

ఒక వ్యక్తి ఖురాన్‌ను విశ్వసించినా విశ్వసించక పోయినా, వాస్త వంగా అతడు దీని అవగాహనపట్ల ఆసక్తి కలిగి ఉంటే, ప్రథమంగా అతడు చెయ్యవలసిన పని ఏమిటంటే, తన మనస్సు నుండి తాను ముందే ఏర్పరచుకున్న భావాలను సిద్ధాంతాలను, అనుకూల, ప్రతి

కూల అభిప్రాయాలను, సాధ్యమయినంత వరకు దూరం చేసుకోవాలి; కేవలం అర్థం చేసుకునే నిష్కల్మషమయిన ఆశయంతో, విశాల హృదయంతో అధ్యయనానికి ఉపక్రమించాలి. ఎవరైతే కొన్ని ప్రత్యేకమైన భావాలను మనస్సులో ఉంచుకుని ఈ గ్రంథాన్ని పఠిస్తారో, వారు దీని పంక్తుల్లో తమ భావాలనే పఠిస్తూ పోతారు. ఖురాన్ గాలి కూడా వారికి సోకదు. ఈ అధ్యయనా విధానం ఏ గ్రంథం పట్ల అయినా సరైనది కాదు. కాని ముఖ్యంగా ఖురానయితే ఇటువంటి వారి కొరకు దాని అవగాహనా ద్వారాలను. భావకవాటాలను అసలు తెరవనే తెరవదు.

పోతే, స్థూలంగా ఎంతో కొంత తెలుసుకో గోరిన వ్యక్తి మాత్రం ఒకసారి అధ్యయనంచేస్తే బహుశా సరిపోవచ్చు. కాని ఖురాన్ లోతుల్లోకి పోదలచిన వ్యక్తి ఖురాన్‌ను రెండు మూడు సార్లు చదివినా చాలదు, అతడు దాన్ని పలుమార్లు చదవాలి. చదివిన ప్రతిసారీ ఒక విశేష రీతిలో చదవాలి; ఒక విద్యార్థిలా పెన్సిల్, నోట్‌బుక్‌లు చేతబూని మరీ అధ్యయనానికి పూనుకోవాలి—అవసరమైన విషయాలు వ్రాసుకుంటూ పోవటానికి. ఇలా అధ్యయనం చెయ్యటానికి సంసిద్ధమైనవారు, ఖురాన్ ప్రతిపాదిస్తున్న ఆలోచన, ఆచరణా వ్యవస్థను సమగ్రంగా అర్థం చేసుకునే ధ్యేయంతో ఖురాన్‌ను కనీసం రెండు పర్యాయాలయినా పూర్తిగా చదవాలి. ఈ ప్రాథమిక అధ్యయనం చేసేటప్పుడు ఖురాన్ స్వరూపాన్ని సమగ్రంగా ఆకళింపు చేసుకోవటానికి ప్రయత్నించాలి; ఈ గ్రంథం అందజేసే మౌలిక భావనలేవో ఆ భావనలు పునాదిగా అది ఎలాంటి జీవన వ్యవస్థను నిర్మిస్తుందో గమనిస్తూపోవాలి. ఈ లోపల ఏ దశలోనయినా ఏదైనా ప్రశ్న తట్టినట్లయితే, దాన్ని గురించి అక్కడికక్కడే ఏదో ఒక నిర్ణయం చేసెయ్యకూడదు. దాన్ని నోట్‌చేసుకుని జ్ఞాపకం ఉంచుకోవాలి, ఓర్పుతో అధ్యయనాన్ని ముందుకు సాగనివ్వాలి. సాధారణంగా ముందు ఎక్కడో ఒక చోట ఆ ప్రశ్నకు సమాధానం తప్పకుండా లభిస్తుంది సమాధానం లభిస్తే ప్రశ్నతోపాటు దాన్నికూడా వ్రాసుకోవాలి. ఒకవేళ

ప్రథమ అధ్యయనంలో ఏ సమస్యకైనా సమాధానం దొరక్కపోతే, ఓర్పుతో రెండోసారి చదవాలి. నా అనుభవం కొద్దీ చెబుతున్నాను, రెండోసారి శ్రద్ధగా అధ్యయనం చేస్తే ఏ ప్రశ్నకైనా సమాధానం దొరక్కపోవటం అనేది బహు అరుదు.

ఇలా ఖురాన్‌ని గురించి ఒక సమగ్రమైన అవగాహన కలిగిన తరువాత, అధ్యయనం చెయ్యటం మొదలెట్టాలి. ఈ సందర్భంలో పాఠకుడు ఖురాన్ బోధనల ఒక్కొక్క అంశాన్ని దృష్టిలో ఉంచుకుని వ్రాసుకుంటూ పోవటం సముచితం. ఉదాహరణకు, ఎలాంటి వ్యక్తుల్ని ఖురాన్, అభిలషనీయులయిన వారుగా, ఎలాంటివారిని ద్వేషించదగిన వారుగా పరిగణిస్తుందీ, 'అనే విషయాన్ని తెలుసుకోదలిస్తే, పాఠకుడు ఈ అంశాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోవడానికి, తన నోట్ బుక్‌లో ఒకవైపున "అభిలషనీయుడైన మనిషి" దానికెదురుగా రెండో వైపున "ద్వేషించ దగిన మనిషి" అని రెండు శీర్షికలు వ్రాసి వాటి క్రింద ఖురాన్ ప్రస్తావించే ఆయా లక్షణాలను వ్రాసుకుంటూ పోవాలి. లేదా, ఖురాన్ ప్రకారం, మానవుడి సాఫల్యం, మోక్షం ఏ విషయాలపై ఆధారపడి ఉన్నాయో, ఏ విషయాలను ఖురాన్ మానవుడికి నష్టకరమనీ, వినాశానికీ, విధ్వంసానికీ దారి తీసే వని సూచిస్తుందో తెలుసుకోదలిస్తే, సరియైన పద్ధతి, నోటు పుస్తకంలో ఒకవైపున "సాఫల్య మార్గాలు" అనీ, మరోవైపున "వినాశ హేతువులు" అనీ శీర్షికలు పెట్టుకుని, ఖురాన్ అధ్యయనం చేసేటప్పుడు వాటిక్రింద ఈ రెంటిని గురించి ఖురాన్ చూపే విషయాలను వ్రాస్తూపోవాలి. ఇదేవిధంగా విశ్వాసాలు, నైతిక విషయాలు. విధులు, హక్కులు, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక రాజకీయ విషయాలు, న్యాయశాస్త్రం సామూహిక వ్యవస్థ. సంధీ, యుద్ధాలకు సంబంధించిన విషయాలు; ఇంకా ఇతర జీవిత సమస్యలను ఒక్కొక్కదాన్ని గురించి ఖురాన్ బోధనలేవో వ్రాసుకుంటూ పోవాలి, తరువాత జీవితానికి సంబంధించిన ఒక్కొక్క రంగంయొక్క సమగ్రస్వరూపం ఎలా తయారవుతుందో, ఈ రంగాల నన్నింటినీ సమన్వయ పరచినపుడు మొత్తం జీవిత

విత్రం ఎలా రూపొందుతుందో అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చెయ్యాలి.

ఎవరైనా ఏదైనా ఒక ప్రత్యేక జీవన సమస్యను గురించి ఖురాన్ దృక్పథం ఏమిటో పరిశోధించదలిస్తే, అందుకు సరైన పద్ధతి ఏమి టంటే, ఆ సమస్యకు సంబంధించిన ప్రాచీన ఆధునిక సాహిత్యా న్నంతా క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యాలి. తద్వారా సమస్యయొక్క మౌలికఅంశాలేవో, దీన్ని గురించి మానవుడు ఇంతవరకు ఆలోచించిందీ, అర్థం చేసుకున్నదీ ఏమిటో, ఇందులో ఇంకా అపరిష్కృతంగా ఉండి పోయిన అంశాలేవో, మానవుని ఆలోచనా శకటం ఎంతదూరం పరుగెత్తి నిలిచిపోయిందో విశదంగా తెలుసుకోవాలి, తరువాత అపరిష్కృతంగా ఉండిపోయిన విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఖురాన్ అధ్యయనం చెయ్యాలి. ఇలా ఏ సమస్యనైనా పరిశోధించే నిమిత్తం, ఖురాన్ పఠనానికి ఎవరైనా ఉపక్రమిస్తే నా అనుభవం ప్రకారం ఇంతకుముందు ఎన్నోసార్లు పఠించిన ఆయత్‌లలోనే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. ఈ ఆయత్‌లలో ఈ భావం కూడ ఉంది అనే విషయం ఊహామాత్రంగానైనా అంతకుపూర్వం స్ఫురించి కూడా ఉండదు

కాని ఖురాన్ అవగాహన కొరకు ఈ మార్గాలన్ని అవలంబించి నప్పటికీ, ఏ ఆశయసిద్ధికై ఖురాన్ అవతరించిందో దానికొరకు, క్రియాత్మకంగా కృషి చెయ్యనంతవరకు మనిషి ఖురాన్ సారాన్ని (Inspirirg Spirit) సంపూర్ణంగా గ్రహించలేడు. మీరు ఈజీ ఛేర్‌లో నడుంవాల్చి ఖురాన్‌ను చదివి, దాని బోధనలన్నీ అర్థం చేసు కోవటానికి, అదికేవలం కొన్ని సిద్ధాంతాలు, దృక్పథాల పుస్తకంకాదు. ఆశ్రమాల్లోనో, మఠాల్లోనో హాయిగా కూర్చుని దాని మర్మహేతువులన్ని చదవటానికి, ప్రపంచంలో ప్రచారంలో ఉన్న "మత" భావన ప్రకారం ఇది కేవలం 'మత' గ్రంథం కూడా కాదు. ప్రారంభంలో సూచించినట్లు ఇది. ఒక సందేశానికి, ఒక ఉద్యమానికి మూల గ్రంథం,

ఇది వచ్చీరాగానే సౌమ్యస్వభావుడైన ఒక సజ్జనుణ్ణి ఏకాంతపు మూలల్లో నుంచి బయటికి తప్పించి దైవాన్ని ధిక్కరించిన లోకాని కెదురుగా నిలబెట్టింది; ఆయనచేత అసత్య వాదాన్ని సవాలు చేయించింది; దైవ ధిక్కారం, దుర్మార్గం, మార్గవిహీనతలకు ఆనాటి ధ్వజ వాహకులైన వారితో ఆయన్ని పోరాటానికి దింపింది; ప్రతి ఇంటి నుండి ఒక్కొక్క పవిత్ర హృదయాన్ని, ఒక్కొక్క మంచి మనసును వెలికితీసి ఈ సత్య సందేశకుని పతాకం క్రింద సమీకరింపించింది; మూల మూలలనుండి ఒక్కొక్క దుర్మార్గుణ్ణి ఒక్కొక్క ఉపద్రవ జనకుణ్ణి ఉసిగొలిపి సత్య ప్రియులతో పోరాడచేసింది. ఒకే ఒక వ్యక్తి పిలుపుతో ఈ బృహత్తర కార్యాన్ని ప్రారంభించి దైవ ప్రాతినిధ్య ప్రభుత్వ స్థాపన వరకు పూర్తిగా 23 సంవత్సరాలు ఈ గ్రంథమే ఈ మహోజ్వల ఉద్యమానికి మార్గదర్శకత్వం వహించింది. సత్యాసత్యాల సుదీర్ఘమయిన ప్రాణసంకట సంఘర్షణా కాలంలో ఒక్కొక్క దశలో, ఒక్కొక్క మలుపులో నిర్మూలనా మార్గాలను, నిర్మాణ పథకాలను సూచించింది.

అటువంటప్పుడు, ధర్మాధర్మాల పోరాటంలో, ఇస్లాం మరియు అజ్ఞానాల సమరరంగంలో మీరసలు అడుగుపెట్టకనేపోతే సంఘర్షణ లోని ఏదశనైనా ఎదుర్కొనే సందర్భమే మీకు తటస్థపడకపోతే, కేవలం ఖురాన్ వచనాలను వల్లిస్తూ ఉన్నంతమాత్రాన, అందులోని నిగూఢ సత్యాలన్నీ మీ ఎదుట ప్రత్యక్షమవటం ఎలా సంభవం? ఖురాన్‌ని మీరు కూలంకషంగా అర్థం చేసుకోగలగాలంటే, దీన్ని చేతబూని లేచి నిలవాలి. దైవం వైపుకు ఆహ్వానించే కార్యాన్ని ప్రారంభించాలి ఏ ఏ బాటలపై ఈ గ్రంథం మిమ్మల్ని నడిపిస్తుందో ఆ ఆ బాటల పైనే నడుస్తూ పురోగమించాలి. అప్పుడే ఖురాన్ అవతరణా కాలంలో ఎదురైన అనుభవాలు మీకు ఎదురవుతాయి. మక్కా, అబీసీనియా,

తాయిఫ్ లాంటి మలుపుల్ని మీరు చూడగలుగుతారు, బద్ర్,[1] ఉహాద్,[2] ల నుండి హునైన్,[3] తబూక్,[4] ల వరకు అన్ని దశలూ మీ ఎదుట నిలుస్తాయి,; అబూజహల్,[5] అబూలహబ్‌లు[6] కూడ తటస్థపడతారు ; కపటులు (మునాఫిక్‌లు), యూదులు కూడ ప్రత్యక్షమవుతారు ; "సాబిఖూనుల్ అవ్వలూన్[7] నుండి ముఅల్లఫతుల్ కులూబ్[8]" వరకు అన్ని రకాల మానవుల నమూనాలను మీరు వీక్షిస్తారు. వీరిలోనే మసలుతారు. వీరిని ఉద్యమ కార్యాల్లో వినియోగించుకుంటారు కూడా. ఇది విలక్షణమయిన "సులూక్" (యోగపథం). దీన్ని నేను "సులూకే ఖురానీ" ఖురాన్ యోగపథం అంటాను. ఈ యోగపథంలోని మహత్తు ఏమిటంటే, మీరు ఒక్కొక్క దశను దాటుతూ ఉంటే, ఖురాన్‌లోని కొన్ని ఆయత్‌లు. (వాక్యాలు), కొన్ని సూరాలు (అధ్యాయాలు) స్వయంగా ముందుకు వచ్చి, అవి సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లోనే అవతరించాయని, ఫలానా ఆదేశాన్ని అందజేశాయనీ సూచిస్తూ ఉంటాయి. అటువంటప్పుడు ఖురాన్ లోని భాష, భావం వ్యాకరణం, వ్యాఖ్యానాల రీత్యా కొన్ని అంశాలు "యోగి" కనుమరుగవటం సాధ్యమే, కాని ఖురాన్ తన నిజ సారాన్ని మాత్రం అతని ఎదుట ప్రత్యక్షపరచటంలో పిసినారితనం ప్రదర్శించదు.

ఈ మూల సూత్రానుసారంగానే ఖురాన్ ఆజ్ఞలు, నైతికబోధనలు,

---

1, 2, 3, 4—ఇస్లామీయ ఉద్యమంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) కు ఎదురయిన సాయుధపోరాటాలు.

5,6 :- —మక్కాలో ఇస్లామీయ ఉద్యమాన్ని ఎదిరించిన వారిలో అగ్రగణ్యులు.

7—ఇస్లాం స్వీకారం విషయంలో అగ్రగాములు.

8—(ఉద్యమం చివరిదశలో) ఇస్లాంను స్వీకరించిన నిర్ధనులైన వారికి ఆర్థికసహాయం చెయ్యటం.

ఆర్థిక, నాగరిక ఆదేశాలు, ఇంకా, జీవితంలోని అనేక రంగాలకు అది సూచించే సూత్రాలు, నియమాలను మనిషి క్రియాత్మకంగా ఆచరించి చూడనంతవరకు అవి అతనికి బోధపడవు. తన వ్యక్తిగత జీవితాన్ని ఖురాన్ అనుసరణకు దూరంగా ఉంచిన వ్యక్తి కూడా ఈ గ్రంథాన్ని అర్థం చేసుకోలేడు, ఇంకా, సామూహిక జీవిత రంగాలన్నీ ఖురాన్ మార్గానికి భిన్నమైన మార్గంలో నడిపించే జాతికూడా దీన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదు.

## సార్వజనీనత

ఖురాన్ సర్వమానవులకు మార్గదర్శకత్వంగా అవతరించిందని స్వయంగా ఖురాన్ చేసేవాదన అందరికీ తెలిసిందే. కాని ఖురాన్ సంబోధన ఎక్కువగా దాని అవతరణకు సమకాలీన అరబ్బులకే పరిమితమయినట్లు అగుపిస్తుంది, అప్పుడప్పుడు అది మానవజాతి నంతటిని, జనసామాన్యాన్నీ సంబోధించినా, తరచుగా అది పలికే విషయాలు అరబ్బుల అభిరుచికి, అరబ్బుల వాతావరణానికి, అరబ్బుల ఇతిహాసానికి, వారి ఆచార సంప్రదాయాలకు సంబంధించినవే. వీటిని గమనిస్తే ఒక సందేహం జనిస్తుంది ; సామాన్య మానవుల మార్గదర్శకత్వం కొరకు అవతరించిన గ్రంథంలో తాత్కాలిక, స్థానిక, జాతీయ పరమైన అంశాలు ఇంత అధికంగా ఎందుకు చోటుచేసుకున్నాయి? ఈ విషయాన్ని దాని వాస్తవరూపంలో అర్థం చేసుకోక పోవటం వల్ల, ఇది కేవలం ఆనాటి అరబ్బుల సంస్కరణకు ఉద్దేశించబడిందే కాని, ఆ తరువాత దాన్ని బలవంతంగా సాగదీసి సర్వజనుల కొరకు, అన్ని కాలాల కొరకు మార్గదర్శక గ్రంథంగా నిర్ణయించటం జరిగిందనే సంశయకు లోనవుతారు ప్రజలు.

ఎవరయినా ఈ ఆక్షేపణను కేవలం ఆక్షేపణగా లేవనెత్తక నిజంగానే విషయాన్ని అర్థంచేసుకోదలిస్తే, వారికి నాదొక సలహా.

చిత్రం ఎలా రూపొందుతుందో అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చెయ్యాలి.

ఎవరైనా ఏదైనా ఒక ప్రత్యేక జీవన సమస్యను గురించి ఖురాన్ దృక్పథం ఏమిటో పరిశోధించదలిస్తే, అందుకు సరైన పద్ధతి ఏమిటంటే, ఆ సమస్యకు సంబంధించిన ప్రాచీన ఆధునిక సాహిత్యాన్నంతా క్షుణ్ణంగా అధ్యయనం చెయ్యాలి. తద్వారా సమస్యయొక్క మౌలిక అంశాలేవో, దీన్ని గురించి మానవుడు ఇంతవరకు ఆలోచించిందీ, అర్థం చేసుకున్నదీ ఏమిటో, ఇందులో ఇంకా అపరిష్కృతంగా ఉండిపోయిన అంశాలేవో, మానవుని ఆలోచనా శకటం ఎంతదూరం పరుగెత్తి నిలిచిపోయిందో విశదంగా తెలుసుకోవాలి, తరువాత అపరిష్కృతంగా ఉండిపోయిన విషయాన్ని దృష్టిలో ఉంచుకుని ఖురాన్ అధ్యయనం చెయ్యాలి. ఇలా ఏ సమస్యనైనా పరిశోధించే నిమిత్తం, ఖురాన్ పఠనానికి ఎవరైనా ఉపక్రమిస్తే నా అనుభవం ప్రకారం ఇంతకుముందు ఎన్నోసార్లు పఠించిన ఆయత్‌లలోనే ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయి. ఈ ఆయత్‌లలో ఈ భావం కూడ ఉంది అనే విషయం ఊహామాత్రంగానైనా అంతకుపూర్వం స్ఫురించి కూడా ఉండదు

కాని ఖురాన్ అవగాహన కొరకు ఈ మార్గాలన్నీ అవలంబించినప్పటికీ, ఏ ఆశయసిద్ధికై ఖురాన్ అవతరించిందో దానికొరకు, క్రియాత్మకంగా కృషి చెయ్యనంతవరకు మనిషి ఖురాన్ సారాన్ని (Inspiring Spirit) సంపూర్ణంగా గ్రహించలేడు. మీరు ఈజీ చేర్‌లో నడుంవాల్చి ఖురాన్‌ను చదివి, దాని బోధనలన్నీ అర్థం చేసుకోవటానికి, అదికేవలం కొన్ని సిద్ధాంతాలు, దృక్పథాల పుస్తకంకాదు. ఆశ్రమాల్లోనో, మఠాల్లోనో తాపీగా కూర్చుని దాని మర్మహేతువులన్నీ వడపోయటానికి, ప్రపంచంలో ప్రచారంలో ఉన్న "మత" భావన ప్రకారం ఇది కేవలం 'మత' గ్రంథం కూడా కాదు. ప్రారంభంలో సూచించినట్లు ఇది, ఒక సందేశానికి, ఒక ఉద్యమానికి మూల గ్రంథం,

ఇది వచ్చీరాగానే సౌమ్యస్వభావుడైన ఒక సజ్జనుణ్ణి ఏకాంతపు మూలల్లో నుంచి బయటికి తప్పించి దైవాన్ని ధిక్కరించిన లోకాని కెదురుగా నిలబెట్టింది; ఆయనచేత అసత్య వాదాన్ని సవాలు చేయించింది; దైవ ధిక్కారం, దుర్మార్గం, మార్గవిహీనతలకు ఆనాటి ధ్వజవాహకులైన వారితో ఆయన్ని పోరాటానికి దింపింది; ప్రతి ఇంటి నుంచి ఒక్కొక్క పవిత్ర హృదయాన్ని, ఒక్కొక్క మంచి మనసును వెలికితీసి ఈ సత్య సందేశకుని పతాకం క్రింద సమీకరించింది; మూల మూలలనుండి ఒక్కొక్క దుర్మార్గుణ్ణి ఒక్కొక్క ఉపద్రవ జనకుణ్ణి ఉసిగొలిపి సత్య ప్రియులతో పోరాడచేసింది. ఒకే ఒక వ్యక్తి పిలుపుతో ఈ బృహత్తర కార్యాన్ని ప్రారంభించి దైవ ప్రాతినిధ్య ప్రభుత్వ స్థాపన వరకు పూర్తిగా 23 సంవత్సరాలు ఈ గ్రంథమే ఈ మహోజ్వల ఉద్యమానికి మార్గదర్శకత్వం వహించింది. సత్యాసత్యాల సుదీర్ఘమయిన ప్రాణసంకట సంఘర్షణా కాలంలో ఒక్కొక్క దశలో, ఒక్కొక్క మలుపులో నిష్క్రమణా మార్గాలను, నిర్మాణ పథకాలను సూచించింది.

అటువంటప్పుడు, ధర్మాధర్మాల పోరాటంలో, ఇస్లాం మరియు అజ్ఞానాల సమరరంగంలో మీరసలు అడుగుపెట్టకనేపోతే సంఘర్షణలోని ఏదశనైనా ఎదుర్కొనే సందర్భమే మీకు తటస్థపడకపోతే, కేవలం ఖురాన్ వచనాలను వల్లిస్తూ ఉన్నంతమాత్రాన, అందులోని నిగూఢ సత్యాలన్నీ మీ ఎదుట ప్రత్యక్షమవటం ఎలా సంభవం? ఖురాన్‌ని మీరు కూలంకషంగా అర్థం చేసుకోగలగాలంటే, దీన్ని చేతబూని లేచి నిలవాలి. దైవం వైపుకు ఆహ్వానించే కార్యాన్ని ప్రారంభించాలి ఏ ఏ బాటలపై ఈ గ్రంథం మిమ్మల్ని నడిపిస్తుందో ఆ ఆ బాటలపైనే నడుస్తూ పురోగమించాలి. అప్పుడే ఖురాన్ అవతరణా కాలంలో ఎదురైన అనుభవాలు మీకు ఎదురవుతాయి. మక్కా, అబీసీనియా,

తాయిఫ్ లాంటి మలుపుల్ని మీరు చూడగలుగుతారు, బద్ర్.[1] ఉహద్,[2] ల నుండి హునైన్,[3] తబూక్,[4] ల వరకు అన్ని దశలూ మీ ఎదుట నిలుస్తాయి,; అబూజహల్,[5] అబూలహబ్‌లు[6] కూడ తటస్థపడతారు ; కపటులు (మునాఫిక్‌లు), యూదులు కూడ ప్రత్యక్ష మవుతారు ; "సాబిఖూనుల్ అవ్వలూన్[7] నుండి ముఅల్లఫతుల్ కులూబ్[8]" వరకు అన్ని రకాల మానవుల నమూనాలను మీరు వీక్షిస్తారు. వీరిలోనే మసలుతారు, వీరిని ఉద్యమ కార్యాల్లో వినియోగించుకుంటారు కూడా. ఇది విలక్షణమయిన "సులూక్" (యోగపథం). దీన్ని నేను "సులూకే ఖురానీ" ఖురాన్ యోగపథం అంటాను. ఈ యోగపథంలోని మహత్తు ఏమిటంటే, మీరు ఒక్కొక్క దశను దాటుతూ ఉంటే, ఖురాన్‌లోని కొన్ని ఆయత్‌లు. (వాక్యాలు), కొన్ని సూరాలు (అధ్యాయాలు) స్వయంగా ముందుకు వచ్చి, అవి సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లోనే అవతరించాయని, ఫలానా ఆదేశాన్ని అందజేశాయనీ సూచిస్తూ ఉంటాయి. అటువంటప్పుడు ఖురాన్ లోని భాష, భావం వ్యాకరణం, వ్యాఖ్యానాల రీత్యా కొన్ని అంశాలు "యోగి" కనుమరుగవటం సాధ్యమే, కాని ఖురాన్ తన నిజ సారాన్ని మాత్రం అతని ఎదుట ప్రత్యక్షపరచటంలో పిసినారి తనం ప్రదర్శించదు.

ఈ మూల సూత్రానుసారంగానే ఖురాన్ ఆజ్ఞలు, నైతికబోధనలు,

---

1, 2, 3, 4—ఇస్లామీయ ఉద్యమంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) కు ఎదురయిన సాయుధపోరాటాలు.

5,6 :—మక్కాలో ఇస్లామీయ ఉద్యమాన్ని ఎదిరించిన వారిలో అగ్రగణ్యులు.

7—ఇస్లాం స్వీకారం విషయంలో అగ్రగాములు.

8—(ఉద్యమం చివరిదశలో) ఇస్లాంను స్వీకరించిన నిర్ధనులైన వారికి ఆర్థికసహాయం చెయ్యటం.

ఆర్థిక, నాగరిక ఆదేశాలు, ఇంకా, జీవితంలోని అనేక రంగాలకు అది సూచించే సూత్రాలు, నియమాలను మనిషి క్రియాత్మకంగా ఆచరించి చూడనంతవరకు అవి అతనికి బోధపడవు. తన వ్యక్తిగత జీవితాన్ని ఖురాన్ అనుసరణకు దూరంగా ఉంచిన వ్యక్తి కూడా ఈ గ్రంథాన్ని అర్థం చేసుకోలేడు, ఇంకా, సామూహిక జీవిత రంగాలన్నీ ఖురాన్ మార్గానికి భిన్నమైన మార్గంలో నడిపించే జాతికూడా దీన్ని సరిగ్గా అర్థం చేసుకోలేదు.

## సార్వజనీనత

ఖురాన్ సర్వమానవులకు మార్గదర్శకత్వంగా అవతరించిందని స్వయంగా ఖురాన్ చేసేవాదన అందరికీ తెలిసిందే. కాని ఖురాన్ సంబోధన ఎక్కువగా దాని అవతరణకు సమకాలీన అరబ్బులకే పరిమితమయినట్లు అగుపిస్తుంది, అప్పుడప్పుడు అది మానవజాతి సంతతినీ, జనసామాన్యాన్నీ సంబోధించినా, తరచుగా అది పలికే విషయాలు అరబ్బుల అభిరుచికి, అరబ్బుల వాతావరణానికి, అరబ్బుల ఇతిహాసానికి, వారి ఆచార సంప్రదాయాలకు సంబంధించినవే. వీటిని గమనిస్తే ఒక సందేహం జనిస్తుంది; సామాన్య మానవుల మార్గదర్శకత్వం కొరకు అవతరించిన గ్రంథంలో తాత్కాలిక, స్థానిక, జాతీయమయిన అంశాలు ఇంత అధికంగా ఎందుకు చోటుచేసుకున్నాయి? ఈ విషయాన్ని దాని వాస్తవరూపంలో అర్థం చేసుకోక పోవటం వల్ల, ఇది కేవలం ఆనాటి అరబ్బుల సంస్కరణకు ఉద్దేశించబడిందే కాని, ఆ తరువాత దాన్ని బలవంతంగా సాగదీసి సర్వజనుల కొరకు, అన్ని కాలాల కొరకు మార్గదర్శక గ్రంథంగా నిర్ణయించటం జరిగిందనే శంకకు లోనవుతారు ప్రజలు.

ఎవరయినా ఈ ఆక్షేపణను కేవలం ఆక్షేపణగా లేవనెత్తక నిజంగానే విషయాన్ని అర్థంచేసుకోదలిస్తే, వారికి నాదొక సలహా.

వారు మొదట స్వయంగా ఖురాన్‌ను చదవాలి. అందులో ఎక్కడైనా కేవలం అరబ్బులకే ప్రత్యేకమయింది, వాస్తవంగానే దేశ కాలపరిమితులకు లోబడినది ఏదైనా విశ్వాసం, అభిప్రాయం లేదా భావన గోచరిస్తుందేమో, లేదా అటువంటి దేదైనా నైతిక సిద్ధాంతమో, ఆచరణ నియమావళియో కానవస్తుందేమో, వేలెట్టి చూపాలి. అంతే కాని, కేవలం అది ప్రత్యేక దేశం, ప్రత్యేక కాలంలోని ప్రజలను సంబోధించి, వారి బహు దైవారాధనకు సంబంధించిన విశ్వాసాలను, ఆచారాలను ఖండించటం చేత వారి పరిసరాల్లోని వస్తువుల్నే నిదర్శనాలుగా చూపి దేవుని ఏకత్వాన్ని నిరూపించటం చేత, ఖురాన్ సందేశం, దాని పిలుపు కూడా తాత్కాలికమయిందనీ స్థానికమయిందని నిర్ణయించటం సమంజసమూ కాదు, సముచితమూ కాదు. గమనించవలసిన విషయమేమిటంటే, 'షిర్క్' (బహు దైవారాధన) ను ఖండిస్తూ, అది చెప్పేదంతా అరేబియా బహుదైవారాధకుల షిర్క్‌కు వర్తించినట్లే ప్రపంచంలోని మరెక్కడి షిర్క్ కయినా వర్తించదా? ఆ నిదర్శనాలనే మనం ఏనాటి బహుదైవోపాసకుల భావసంస్కరణార్థమయినా ఉదహరించలేమా? తౌహీద్ (దేవునిఏకత్వపు వాదన)ను ధృవీకరించటానికి, ఖురాన్ నిరూపణావిధానాన్ని కొంత మార్పుతో అన్ని కాలాల్లోను అన్నిదేశాల్లోను మనం వినియోగించలేమా? ఈ ప్రశ్నకు సమాధానం అనుకూలంగా ఉంటే, ప్రత్యేకకాలంలో, ప్రత్యేక జాతిని సంబోధించి అందజేసినంత మాత్రాన, విశ్వజనీనమైన బోధనల్ని, తాత్కాలికమైనవిగా, స్థానికమైనవిగా నిర్ణయించటం సబబు కాదు. ప్రపంచంలోని ఏ తత్వమైనా, ఏ జీవన వ్యవస్థ అయినా, ఏ ఆలోచనా విధానమైనా, దాని విషయాలన్నీ ఆమూలాగ్రం అన్నింటికీ అతీతమయినవిగా, కేవలం (abstract) గా అందజెయ్యబడలేదు; ఇంకా ఒక నిర్దిష్ట పరిస్థితిపై వాటిని అన్వయింప జెయకుండానే వాటిని వివరించటమన్నది జరగలేదు. అన్నింటికీ పరమైన ఇలాంటి విషయం అసలు సాధ్యపడదు కూడా, ఒకవేళ సాధ్యపడినా, ఇలా తయారైన సిద్ధాంతం కేవలంగ్రంథం పుటలపైనే మనగలుగుతుంది కాని, మానవ

జీవితంలో అది అంతర్లీనమై ఆచరణాత్మకమైన వ్యవస్థగా రూపొందటం మాత్రం కల్ల.

మరొక మాట ; ఒక సైద్ధాంతిక, నైతిక, సాంస్కృతిక ఉద్యమాన్ని అంతర్జాతీయ స్థాయిలో వ్యాపింప జేసే ఉద్దేశ్యం ఉంటే, దాన్ని ఆదిలోనే అంతర్జాతీయ స్థాయిలో స్థాపించే ప్రయత్నం చెయ్య వలసిన అవసరం ఏమాత్రం లేదు. నిజం చెప్పాలంటే, అలా చెయ్యటం శ్రేయస్కరం కూడా కాదు. వాస్తవానికి దీనియొక్క సరైన, ఆచరణాత్మక విధానం ఒక్కటే: ఏ సిద్ధాంతాలు, ఏ దృక్పథాలు, ఏ సూత్రాల ఆధారంగా మానవ జీవన వ్యవస్థను ఆ ఉద్యమం స్థాపించ గోరుతుందో, వాటిని స్వయంగా ఆ ఉద్యమం ప్రారంభమయిన దేశం లోనే శక్తివంతంగా సమర్పించే కృషిచెయ్యాలి. ఏ ప్రజల భాష, నైజం, గుణం మరియు స్వభావం, ఉద్యమ సందేశకులకు బాగా తెలుసో, వారికి బాగా మనోగతమయ్యేలా బోధించాలి : ఇంకా ఆ సిద్ధాంతాలను తమ దేశంలోనే అమలు పరచి వాటి ఆధారంగా జీవన వ్యవస్థను విజయవంతంగా నడిపి, ప్రపంచానికి ఆదర్శంగా చూపాలి. అప్పుడే ఇతర దేశస్థులు దాని పట్ల ఆసక్తి వ్యక్తం చేస్తారు. వారిలోని మేధావులు ముందుకు వచ్చి దాన్ని అర్థం చేసుకోవటానికి, దాన్ని తమ దేశంలో అమలు పరచటానికి ప్రయత్నిస్తారు. కనుక తేలిందేమంటే ఒక ఆలోచన, ఆచరణావ్యవస్థను ప్రారంభంలో ఒక ప్రత్యేక జాతికి అందజెయ్యటం, నిరూపణాశక్తి నంతటినీ ఆ జాతి ప్రజలకు బోధ పరచటానికి, వారిని సంతృప్త పరచటానికి వినియోగించటం వంటి విషయాలను మాత్రమే ఆధారంగాతీసుకుని, ఆ ఆలోచన ఆచరణా వ్యవస్థ కేవలం ఒక ప్రత్యేక జాతికే చెందినదనటం ఏ మాత్రం సమంజసం కాదు. వాస్తవానికి ఒక జాతీయ వ్యవస్థను అంతర్జాతీయ వ్యవస్థ నుండి, ఒక తాత్కాలిక వ్యవస్థను ఒక శాశ్వత వ్యవస్థనుండి వేరుచేసే విశేష లక్షణాలేవంటే : ఒక జాతీయ వ్యవస్థ ఒక ప్రత్యేక జాతి ఔన్నత్యం కొరకే, దాని ప్రత్యేక హక్కుల కొరకే కృషిజేస్తుంది. లేదా దాని సిద్ధాంతాలు, సూత్రాలు ఇతర జాతుల ప్రజలకు ఉపయోగ

పడనిపై ఉంటాయి. దీనికి ప్రతిగా, ఒక అంతర్జాతీయ వ్యవస్థ మానవులందరికీ సమానస్థానం, సమానహక్కులనిస్తుంది. దాని సిద్ధాంతాల్లో కూడా విశ్వజనీనత గోచరిస్తుంది. ఇదే విధంగా ఒక తాత్కాలిక వ్యవస్థకు మూలాధారమైన సిద్ధాంతాలు కాలగతిలో సంభవించే కొన్ని పరివర్తనలకే తమ ఆచరణా యోగ్యతను పూర్తిగా కోల్పోతాయి. దీనికి భిన్నంగా ఒక శాశ్వత వ్యవస్థ యొక్క సూత్రాలు సమస్త కాలపరిణామాలకు సరిగ్గా అన్వయిస్తూ ఉంటాయి. ఈ ప్రత్యేకతలను దృష్టిలో ఉంచుకుని ఖురాన్ అధ్యయనం చెయ్యాలి. తద్వారా ఖురాన్ ప్రతిపాదించే జీవన వ్యవస్థ దేశ కాల అవధులకు పరిమితమైనదనటానికి ఆస్కారం కలిగించే విషయాలను ఎత్తి చూపాలి.

## పరిపూర్ణ జీవన వ్యవస్థ

ఖురాన్‌ను గురించి మరొక విషయంకూడా పాఠకునికి ముందే తెలిసి ఉంటుంది—ఇదొక సవివరమైన మార్గదర్శకావళి అని, జీవన సంవిధాన గ్రంథం అనీ, అతడు విని ఉంటాడు. కాని దీన్ని చదివినప్పుడు ఇందులో సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక ఇత్యాది రంగాలకు సంబంధించిన విపులమైన ఆదేశాలు, నిర్దేశాలు నియమాలు అతనికి కనిపించవు. అంతేకాదు, ఖుర్ఆన్ మరీ మరీ నొక్కి చెప్పే నమాజ్, జకాత్* వంటి విధుల విషయంలో కూడ అవసరమైన ఆదేశాలు సవివరంగా ఉన్న జాబితా నొక దాన్ని ఇది అందజెయ్యలేదు. అయితే దీన్ని ఏ భావంలో మార్గదర్శక గ్రంథమనాలో బోధపడక కళవళ పడతాడు మనిషి.

---

*జకాత్ = వెండి బంగారాలు, ధనం, పశు సంపద, ధాన్యసంపదలు ఒకపరిమితి కన్నా అధికంగా ఉన్నప్పుడు ముస్లింలు విధిగా చెల్లించవలసిన ఆ సంపదల్లోని నిర్ణీత భాగం.

ఈ చిక్కు ఏర్పడటానికి కారణం, ఒక యథార్థం కనుమరుగవటమే. దైవం కేవలం గ్రంథాన్ని మాత్రమే అవతరింప జెయ్యలేదు, ఒక ప్రవక్తను సైతం ప్రభవింప జేశాడు. అసలు పథకం ప్రకారం కేవలం కట్టడం యొక్క రూప కల్పన మాత్రమే రచించి తదనుగుణంగా ప్రజలే కట్టడం నిర్మించుకోవాలని నిర్ణయమై ఉంటే నిస్సందేహంగా నిర్మాణ కార్యక్రమం యొక్క ఒక్కొక్క అంశం ప్రజలకు వివరంగా తెలుపటం అత్యవసరమే. కాని నిర్మాణానికి నిర్దేశాలతోపాటు ఒక ఇంజనీరు కూడా అధికారికంగా నియమించబడి అతడు ఆ నిర్దేశాల కనుగుణంగా ఒక కట్టడాన్ని కూడా నిర్మించి నిలబెట్టినప్పుడు, ఆ ఇంజనీరునూ, అతడు నిర్మించిన కట్టడాన్నీ త్రోసిపుచ్చి కేవలం రూపకల్పనలోనే చిన్నచిన్న అంశాలన్నింటి వివరాలను వెదకటం, అవి అందులో లభించక పోయేసరికి, ఆ ప్లాను అసంపూర్ణమయిందని అభ్యంతరం తెలుపటం శుద్ధ పొరపాటు. ఖురాన్ చిన్న చిన్న విషయాల జాబితా కాదు, సిద్ధాంతాల మూల సూత్రాల గ్రంథం. ఇస్లామీయ వ్యవస్థ యొక్క సైద్ధాంతిక, నైతిక ప్రాతిపదికల్ని ప్రస్ఫుటంగా విశదపరచటమే కాక సమంజసమైన ఆధారాలు, భావోద్రేకాల ఆకర్షణతో వాటిని పటిష్టవంతం కూడా చెయ్యటం దాని అసలు. కార్యక్రమం ఇకపోతే, ఇస్లామీయ జీవితపు ఆచరణాత్మక రూపం. ఈ విషయంలో మానవుని మార్గదర్శకత్వం కొరకు అది జీవితపుఒక్కొక్క విభాగానికి సంబంధించిన వివరమైన నియమాలు శాసనాలను సూచించదు; దానికి బదులుగా జీవితపు ప్రతివిభాగం యొక్క పరిధుల్ని అది సూచిస్తుంది. ఇంకా, కొన్ని మలుపుల్లో ప్రస్ఫుటమైన గురుతురాళ్ళను ప్రతిష్ఠించి పెడుతుంది. ఇవి అల్లాహ్ అభీష్టానికి అనుగుణంగా విభాగాల వ్యవస్థాపన నిర్మాణాలు ఎలా జరగాలో నిర్దిష్టంగా నిర్ణయిస్తాయి. ఈ నిర్దేశాల ప్రకారం ఆచరణాత్మకంగా ఇస్లామీయ జీవితాన్ని నిర్మించటమే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) బాధ్యత. ఖురాన్ ప్రతిపాదించిన సిద్ధాంతాల ఆచరణాత్మక అన్వయం, వ్యాఖ్యానాలు కాగల వ్యక్తిగత స్వరూప స్వభావాలు, సమాజం, రాజ్యాల ఆదర్శప్రాయ

వారు మొదట స్వయంగా ఖురాన్‌ను చదవాలి. అందులో ఎక్కడైనా కేవలం అరబ్బులకే ప్రత్యేకమయింది, వాస్తవంగానే దేశ కాలపరిమితులకు లోబడినది ఏదైనా విశ్వాసం, అభిప్రాయం లేదా భావన గోచరిస్తుందేమో, లేదా అటువంటి దేదైనా నైతిక సిద్ధాంతమో, ఆచరణ నియమావళియో కానవస్తుందేమో, వేలెట్టి చూపాలి. అంతే కాని, కేవలం అది ప్రత్యేక దేశం, ప్రత్యేక కాలంలోని ప్రజలను సంబోధించి, వారి బహు దైవారాధనకు సంబంధించిన విశ్వాసాలను, ఆచారాలను ఖండించటం చేత వారి పరిసరాల్లోని వస్తువుల్నే నిదర్శనాలుగా చూపి దేవుని ఏకత్వాన్ని నిరూపించటం చేత, ఖురాన్ సందేశం, దాని పిలుపు కూడా తాత్కాలికమయిందనీ స్థానికమయిందని నిర్ణయించటం సమంజసమూ కాదు, సముచితమూ కాదు. గమనించవలసిన విషయమేమిటంటే, 'షిర్క్' (బహు దైవారాధన) ను ఖండిస్తూ, అది చెప్పేదంతా అరేబియా బహుదైవారాధకుల షిర్క్‌కు వర్తించినట్లే ప్రపంచంలోని మరెక్కడి షిర్క్ కయినా వర్తించదా? ఆ నిదర్శనాలనే మనం ఏనాటి బహుదైవోపాసకుల భావసంస్కరణార్థమయినా ఉదహరించలేమా? తౌహీద్ (దేవునిఏకత్వపు వాదన)ను ధృవీకరించటానికి, ఖురాన్ నిరూపణావిధానాన్ని కొంత మార్పుతో అన్ని కాలాల్లోను అన్నివేళల్లోను మనం వినియోగించలేమా? ఈ ప్రశ్నకు సమాధానం అనుకూలంగా ఉంటే, ప్రత్యేకకాలంలో, ప్రత్యేకజాతిని సంబోధించి అందజేసినంత మాత్రాన, విశ్వజనీనమైన బోధనల్ని, తాత్కాలికమైనవిగా, స్థానికమైనవిగా నిర్ణయించటం సబబుకాదు. ప్రపంచంలోని ఏ తత్వమైనా, ఏ జీవన వ్యవస్థ అయినా, ఏ ఆలోచనా విధానమైనా, దాని విషయాలన్నీ ఆమూలాగ్రం అన్నింటికీ అతీతమయినవిగా, కేవలం (abstract) గా అందజెయ్యబడలేదు; ఇంకా ఒక నిర్దిష్ట పరిస్థితిపై వాటిని అన్వయింప జెయకుండానే వాటిని వివరించటమన్నది జరగలేదు. అన్నింటికీ పరమైన ఇలాంటి విషయం అసలు సాధ్యపడదు కూడా, ఒకవేళ సాధ్యపడినా, ఇలా తయారైన సిద్ధాంతం కేవలంగ్రంథం పుటలపైనే మనగలుగుతుంది కాని, మానవ

జీవితంలో అది అంతర్లీనమై ఆచరణాత్మకమైన వ్యవస్థగా రూపొందటం మాత్రం కల్ల.

మరొక మాట; ఒక సైద్ధాంతిక, నైతిక, సాంస్కృతిక ఉద్యమాన్ని అంతర్జాతీయ స్థాయిలో వ్యాపింప జేసే ఉద్దేశ్యం ఉంటే, దాన్ని ఆదిలోనే అంతర్జాతీయ స్థాయిలో స్థాపించే ప్రయత్నం చెయ్య వలసిన అవసరం ఏమాత్రం లేదు. నిజం చెప్పాలంటే, అలా చెయ్యటం శ్రేయస్కరం కూడా కాదు. వాస్తవానికి దీనియొక్క సరైన, ఆచరణాత్మక విధానం ఒక్కటే: ఏ సిద్ధాంతాలు, ఏ దృక్పథాలు, ఏ సూత్రాల ఆధారంగా మానవ జీవన వ్యవస్థను ఆ ఉద్యమం స్థాపించ గోరుతుందో, వాటిని స్వయంగా ఆ ఉద్యమం ప్రారంభమయిన దేశం లోనే శక్తివంతంగా సమర్పించే కృషిచెయ్యాలి. ఏ ప్రజల భాష, నైజం, గుణం మరియు స్వభావం, ఉద్యమ సందేశకులకు బాగా తెలుసో, వారికి బాగా మనోగతమయ్యేలా బోధించాలి; ఇంకా ఆ సిద్ధాంతాలను తమ దేశంలోనే అమలు పరచి వాటి ఆధారంగా జీవన వ్యవస్థను విజయవంతంగా నడిపి, ప్రపంచానికి ఆదర్శంగా చూపాలి. అప్పుడే ఇతర దేశస్థులు దాని పట్ల ఆసక్తి వ్యక్తం చేస్తారు. వారిలోని మేధావులు ముందుకు వచ్చి దాన్ని అర్థం చేసుకోవటానికి, దాన్ని తమ దేశంలో అమలు పరచటానికీ ప్రయత్నిస్తారు. కనుక తేలిందేమింటే ఒక ఆలోచన, ఆచరణావ్యవస్థను ప్రారంభంలో ఒక ప్రత్యేక జాతికి అందజెయ్యటం, నిరూపణాశక్తి నంతటినీ ఆ జాతి ప్రజలకు బోధ పరచటానికి, వారిని సంతృప్త పరచటానికి వినియోగించటం వంటి విషయాలను మాత్రమే ఆధారంగాతీసుకుని, ఆ ఆలోచన ఆచరణా వ్యవస్థ కేవలం ఒక ప్రత్యేక జాతికే చెందినదనటం ఏ మాత్రం సమంజసం కాదు. వాస్తవానికి ఒక జాతీయ వ్యవస్థను అంతర్జాతీయ వ్యవస్థ నుండి, ఒక తాత్కాలిక వ్యవస్థను ఒక శాశ్వత వ్యవస్థనుండి వేరుచేసే విశేష లక్షణాలేవంటే: ఒక జాతీయ వ్యవస్థ ఒక ప్రత్యేక జాతి ఔన్నత్యం కొరకే, దాని ప్రత్యేక హక్కుల కొరకే కృషిజేస్తుంది. లేదా దాని సిద్ధాంతాలు, సూత్రాలు ఇతర జాతుల ప్రజలకు ఉపయోగ

పపనిపై ఉంటాయి. దీనికి ప్రతిగా, ఒక అంతర్జాతీయ వ్యవస్థ మానవులందరికీ సమానస్థానం, సమానహక్కులనిస్తుంది. దాని సిద్ధాంతాల్లో కూడా విశ్వజనీనత గోచరిస్తుంది. ఇదే విధంగా ఒక తాత్కాలిక వ్యవస్థకు మూలాధారమైన సిద్ధాంతాలు కాలగతిలో సంభవించే కొన్ని పరివర్తనలకే తమ ఆచరణా యోగ్యతను పూర్తిగా కోల్పోతాయి. దీనికి భిన్నంగా ఒక శాశ్వత వ్యవస్థ యొక్క సూత్రాలు సమస్త కాలపరిణామాలకు సరిగ్గా అన్వయిస్తూ ఉంటాయి. ఈ ప్రత్యేకతలను దృష్టిలో ఉంచుకుని ఖురాన్ అధ్యయనం చెయ్యాలి. తద్వారా ఖురాన్ ప్రతిపాదించే జీవన వ్యవస్థ దేశ కాల అవధులకు పరిమితమైనదనటానికి ఆస్కారం కలిగించే విషయాలను ఎత్తి చూపాలి.

## పరిపూర్ణ జీవన వ్యవస్థ

ఖురాన్‌ను గురించి మరొక విషయంకూడా పాఠకునికి ముందే తెలిసి ఉంటుంది—ఇదొక సవివరమైన మార్గదర్శకావళి అని, జీవన సంవిధాన గ్రంథం అనీ, అతడు విని ఉంటాడు. కాని దీన్ని చదివినప్పుడు ఇందులో సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక ఇత్యాది రంగాలకు సంబంధించిన విపులమైన ఆదేశాలు, నిర్దేశాలు నియమాలు అతనికి కనిపించవు. అంతేకాదు, ఖుర్‌ఆన్ మరీ మరీ నొక్కి చెప్పే నమాజ్, జకాత్* వంటి విధుల విషయంలో కూడ అవసరమైన ఆదేశాలు సవివరంగా ఉన్న జాబితా నొక దాన్ని ఇది అందజెయ్యలేదు. అయితే దీన్ని ఏ భావంలో మార్గదర్శక గ్రంథమనాలో బోధపడక కళవళ పడతాడు మనిషి.

---

*జకాత్ = వెండి బంగారాలు, ధనం, పశు సంపద, ధాన్యసంపదలు ఒకపరిమితి కన్నా అధికంగా ఉన్నప్పుడు ముస్లింలు విధిగా చెల్లించవలసిన ఆ సంపదల్లోని నిర్ణీత భాగం.

ఈ చిక్కు ఏర్పడటానికి కారణం, ఒక యదార్థం కనుమరుగవటమే. దైవం కేవలం గ్రంథాన్ని మాత్రమే అవతరింప చెయ్యలేదు, ఒక ప్రవక్తను సైతం ప్రభవింప జేశాడు. అసలు పథకం ప్రకారం కేవలం కట్టడం యొక్క రూప కల్పన మాత్రమే రచించి తదనుగుణంగా ప్రజలే కట్టడం నిర్మించుకోవాలని నిర్ణయమై ఉంటే నిస్సందేహంగా నిర్మాణ కార్యక్రమం యొక్క ఒక్కొక్క అంశం ప్రజలకు వివరంగా తెలుపటం అత్యవసరమే. కాని నిర్మాణానికి నిర్దేశాలతోపాటు ఒక ఇంజనీరు కూడా అధికారికంగా నియమించబడి అతడు ఆ నిర్దేశాల కనుగుణంగా ఒక కట్టడాన్ని కూడా నిర్మించి నిలబెట్టినప్పుడు, ఆ ఇంజనీరునూ, అతడు నిర్మించిన కట్టడాన్నీ త్రోసిపుచ్చి కేవలం రూపకల్పనలోనే చిన్నచిన్న అంశాలన్నింటి వివరాలను వెదకటం. అవి అందులో లభించక పోయేసరికి, ఆ ప్లాను అసంపూర్ణమయిందని అభ్యంతరం తెలుపటం శుద్ధ పొరపాటు. ఖురాన్ చిన్న చిన్న విషయాల జాబితా కాదు, సిద్ధాంతాల మూల సూత్రాల గ్రంథం. ఇస్లామీయ వ్యవస్థ యొక్క సైద్ధాంతిక, నైతిక ప్రాతిపదికల్ని ప్రస్ఫుటంగా విశదపరచటమే కాక సమంజసమైన ఆధారాలు, భావోద్రేకాల ఆకర్షణతో వాటిని పటిష్టవంతం కూడా చెయ్యటం దాని అసలు. కార్యక్రమం ఇకపోతే, ఇస్లామీయ జీవితపు ఆచరణాత్మక రూపం. ఈ విషయంలో మానవుని మార్గదర్శకత్వం కొరకు అది జీవితపు ఒక్కొక్క విభాగానికి సంబంధించిన వివరమైన నియమాలు శాసనాలను సూచించదు; దానికి బదులుగా జీవితపు ప్రతివిభాగం యొక్క పరిధుల్ని అది సూచిస్తుంది. ఇంకా, కొన్ని మలుపుల్లో ప్రస్ఫుటమైన గురుతురాళ్ళను ప్రతిష్ఠించి పెడుతుంది. ఇవి అల్లాహ్ అభీష్టానికి అనుగుణంగా విభాగాల వ్యవస్థాపన నిర్మాణాలు ఎలా జరగాలో నిర్దిష్టంగా నిర్ణయిస్తాయి. ఈ నిర్దేశాల ప్రకారం ఆచరణాత్మకంగా ఇస్లామీయ జీవితాన్ని నిర్మించటమే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) బాధ్యత. ఖురాన్ ప్రసాదించిన సిద్ధాంతాల ఆచరణాత్మక అన్వయం, వ్యాఖ్యానాలు కాగల వ్యక్తిగత స్వరూప స్వభావాలు, సమాజం, రాజ్యాల ఆదర్శప్రాయ

మయిన రూపురేఖలు ప్రపంచానికి చూపటానికే ఆయన్ని నియ మించడం జరిగింది.

## వ్యాఖ్యానాల్లో విభేదాలు

మనుషుల మనస్సుల్ని అసంతృప్తపరచే మరొక విషయం ఏమి టంటే, ఒకవైపున ఖురాన్, దైవగ్రంథం అవతరించిన తరువాత విభే దాలు, వేర్పాటు ధోరణులు అవలంబించి ధర్మాన్ని ముక్కలుచెక్కలుగా విభజించే వారిని అతి తీవ్రంగా ఖండిస్తుంది; మరొకవైపున ఖురాన్ ఆజ్ఞల భావాన్వయంలో, వ్యాఖ్యానాల్లో విభేదాలున్నాయి-కేవలం ఆధుని కుల్లోనే కాదు, అగ్రగాములుగా అలరారిన ధర్మవేత్తల్లోనూ, వారి ముందు తాబియీన్ (సహాబా అనుచరులు) లోను, ఆ మాటకు వస్తే మహాప్రవక్త (సఅసం) సహచరుల్లోనూ (సహాబా) కానవస్తాయి. చివరికి అందరూ ఏకగ్రీవంగా ఒకే వ్యాఖ్యానం చేసినటువంటి ఒక్క ఆదేశం కూడా ఖురాన్‌లో లేదని చెప్పవచ్చు. అయితే వీరంతా ఖురాన్ ప్రకటించిన ఆ ఖండనకు, నిరసనకు గురవుతారా? కాకపోతే, ఖురాన్ నిషేధించే ఆ విభేదాలు, వేర్పాటు ధోరణులు ఏవి?

ఇది సర్వతోముఖమయిన విస్తృత సమస్య. దీన్ని వివరంగా చర్చించే అవకాశం ఇప్పుడు లేదు. ప్రస్తుతం ఒక సాధారణ ఖురాన్ పాఠకుని చిక్కును విడదీయటానికి ప్రయత్నిస్తాను. ఖురాన్ ఆరోగ్య వంతమైన భేదాభిప్రాయాన్ని వ్యతిరేకించదు. అయితే ఆ విభేదం ధర్మం పట్ల ఏకాభిప్రాయంతో, ఇస్లామీయ సాంఘిక వ్యవస్థలో ఐక్యంగా ఉంటూ, ఆదేశాలు, భావాల అన్వయంలో, కేవలం చిత్త శుద్ధితో చేసిన పరిశోధనకు ఫలితంగా ఏర్పడిన విభేదమై ఉండాలి. ఖురాన్ గర్హించేది, అహంభావం, వక్రదృష్టితో ప్రారంభమై, ముఠా తత్వానికీ, పరస్పర స్పర్ధలకు దారితీసే విభేదాన్నే. ఈ రెండు రకాల విభేదాలు, వాటి వాస్తవికత రీత్యా కూడ సమానంకావు, మరియు పరిణామం దృష్ట్యా కూడ వాటికి పోలికేలేదు. అలాంటప్పుడు రెంటినీ

ఒకే తాటితో ఎలా కట్టగలం? మొదటి కోవకు చెందిన భేదాభి ప్రాయమైతే ప్రగతికి ప్రాణం, సజీవసమాజానికి ఆత్మలాంటిది. బుద్ధి వివేకాలున్న వారితో ఏర్పడిన ప్రతిసమాజంలోనూ ఇది ఉంటుంది. దీని ఉనికే జీవితానికి చిహ్నం, ఇదిలేని సమాజం వివేకవంతులతో కాక, మోడువారిన మొద్దులతో నిండివుంటుంది. పోతే, రెండోరకం విభేదం: ఇది ఏ సమాజంలో తలెత్తినా దాన్ని ఛిన్నాభిన్నం చేస్తుంది. ఇది పొడసూపటం ఆరోగ్యానికి కాదు, రోగానికి గుర్తు. దీని పరిణా మాలు ఏ సమాజానికైనా ఎట్టి పరిస్థితుల్లోను ప్రయోజనకరం కావు. ఈ రెండురకాల విభేదాలలోగల భేదం ప్రస్ఫుటంగా ఇలా ఉంటుంది:—

ఒక రూపంలో: అల్లాహ్, ప్రవక్తల విధేయతను పాటించాలనే విషయం పట్ల సమాజంలోని ప్రజలందరికీ ఏకాభిప్రాయం ఉంటుంది. ఆదేశాల మూలాధారం ఖురాన్ మరియు ప్రవక్త సంప్రదాయమైన సున్నత్‌లే అన్న విషయం కూడా ఏకగ్రీవంగా ఒప్పుకున్నదే; ఆ తరు వాత, ఈ సమాజంలోని ఇద్దరు ధర్మవేత్తలు ఏదైనా నిమ్న విషయం పరిశోధనలోనో లేదా ఇద్దరు న్యాయమూర్తులు ఒకకేసు తీర్పు విషయం లోనో విభేదించడం సాధ్యమే. కాని వారిలో ఎవరున్నూ ఈ సమస్యకు, దానికి సంబంధించిన తమఅభిప్రాయానికి "ధర్మం"లో మౌలికస్థానాన్ని ఆపాదించరు; దానిపట్ల భేదాభిప్రాయాన్ని వెలిబుచ్చిన వారిని ధర్మం నుండి వెలివెయ్యరు; దానికి బదులుగా ఉభయులూ తమ తమ ఆధా రాలను సమర్పించి తమశక్తి మేరకు పరిశోధనను పూర్తిచెయ్యటానికి కృషిచేస్తారు. ఆ రెండు అభిప్రాయాల్లో ఏ ఒక్క దాన్నయినా స్వీక రించటమో లేదా రెంటినీ ఆచరణలో పెట్టటమో అనే విషయాన్ని ప్రజాభిప్రాయానికో, చట్టసంబంధమైన విషయమైతే దేశంలోని అత్యున్నత న్యాయస్థానానికో, సామూహిక విషయమైతే సాంఘిక వ్యవస్థకో వదలివేస్తారు.

రెండో రూపంలో: ధర్మంయొక్క మౌలిక విషయాల్లోనే విభేదాలు లేవదీయటం. ఒక విద్వాంసుడు, షరీయత్‌వేత్త (ముఫ్తి), ఆధ్యాత్మిక తత్వవేత్త (సూఫి) దార్శనికుడు లేక ఒక నాయకుడు–వీరిలో ఎవరైనా, అల్లాహ్, ఆయన ప్రవక్త, ధర్మంలో మౌలిక సమస్యగా పరిగణించని ఒకానొక సమస్యపట్ల ఒక అభిప్రాయం కలిగివుండి, దాన్ని అనవసరంగా సాగదీసి ధర్మంలో మౌలిక సమస్యగా నిర్ణయించి, దానికి భిన్నమైన అభిప్రాయం కల వారిని ధర్మం నుండి, సమాజం నుండి వెలివేసి తనను సమర్థించే వారిని ఒక ముఠాగా ఏర్పరచుకుని అసలు ఉమ్మత్ (ఇస్లామీయ అనుచర సంఘం) తమదేనని, మిగతా వారంతా నరకవాసులేనని, ముస్లిములుగా మనదలచిన వారు తమ ముఠాలో చేరాలని లేకపోతే ముస్లింలుగా ఉండజాలరని బహిరంగంగా చాటుతారు.

దివ్య ఖురాన్, విభేదాన్ని, ముఠాతత్వాన్ని ఖండించిన చోటల్లా దాని ఉద్దేశ్యంలో ఈ రెండో కోవకు చెందిన విభేదమే ఉంది. పోతే మొదటి రకం విభేదం, ఇటువంటి వాటికి తార్కాణాలు ఎన్నో స్వయంగా మహాప్రవక్త (సఅసం) సమక్షంలోనే ఉత్పన్నమయ్యాయి. ఆయన అనుమతించటమే కాక వాటిని శ్లాఘించారు కూడా. ఎందువల్లనంటే, ఇలాంటి విభేదం వల్ల సమాజంలో చింతన, ఆలోచన, పరిశోధన, అనుశీలన, అవగాహన చెయ్యగల సామర్థ్యాలు ఉన్నట్లు రుజువవుతుంది. సమాజంలోని మేధావులు తమ ధర్మం, దాని ఆదేశాలపట్ల శ్రద్ధాసక్తులు కలిగి ఉన్నారని, వారి మేధ వివేచనలు వారి జీవిత సమస్యల పరిష్కారాన్ని ధర్మానికి వెలుపల కాకుండా ధర్మం పరిధిలోనే అన్వేషిస్తాయని తెలుస్తుంది. మొత్తానికి సమాజం సిద్ధాంతాలపై ఏకాభిప్రాయం కలిగి ఉండటం ద్వారా తన ఐక్యతను కాపాడుకుంటూ తనలోని విద్వాంసులు, ఆలోచనాపరులకు సరయిన పరిధుల్లో అన్వేషణ, పరిశోధన, అన్వయంవంటి విషయాల్లో స్వేచ్ఛనిచ్చి ప్రగతికి పూబాట చెయ్యాలనే స్వర్ణసూత్రాన్ని అనుసరిస్తుందని ద్యోతకమవుతుంది.

## "వమా తౌఫీకీ ఇల్లా బిల్లాహ్"

"నాకు సాధ్యమయింది ఇదే—వాస్తవ జ్ఞానమైతే అల్లాహ్‌కే ఉంది. నేను ఆయన్నే పూర్తిగా నమ్ముకున్నాను; ఆయన్నే మార్గ దర్శకత్వం కొరకు అర్థిస్తున్నాను."

ఖురాన్ అధ్యయనం చేసేటప్పుడు పాఠకుని మనస్సులో ఉత్పన్న మయ్యే ప్రశ్నల నన్నింటినీ ఈ పుస్తకంలో చర్చించటం నా దృష్టిలో లేదు. ఎందుకంటే అలాంటి ప్రశ్నలు అధికంగా ఏదో ఒక ఆయత్ లేక సూరా పఠించే సందర్భంలో ఉద్భవిస్తాయి. అలాంటి వాటి సమాధానం "తఫ్‌హీముల్ ఖురాన్" లో ఇవ్వడానికి కృషి జరిగింది. కాబట్టి అటువంటి ప్రశ్నల్ని వదలి కేవలం పూర్ణతః ఖురాన్‌కు సంబంధించిన సమగ్రమైన ప్రశ్నల్నే ఇక్కడ చర్చించాను.